Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 83 • సంచిక: 21 • 24-5-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# స్థానిక ఎన్నికలకు సిద్ధమైన సీఎం!

స్థానిక ఎన్నికలు జరపడానికే సిద్ధమైపోయాడు ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి. చాలా సాహసోపేతమైన నిర్ణయం ఇది. రాష్ట్రంలో రాజకీయ వాతావరణం ఎట్లా వుందో అందరికీ తెలిసిన సంగతే. ఆంధ్రలో వైఎస్‌జగన్, తెలంగాణలో కెసిఆర్ కాంగ్రెస్ కోటలను బ్రద్ధలు చేసి పారేస్తున్నారు. ఏ సర్వే నివేదిక చూసినా ఆ విషయం స్పష్టమైపోతుంది. ఈ నేపథ్యంలో ఎన్నికలకు పూనుకోవడం అంటే సామాన్యమైన విషయమా?

అయితే ముఖ్యమంత్రి ఉద్దేశ్యం వేరు. గ్రామ స్థాయిలో పార్టీ రహితంగా సర్పంచ్ ఎన్నికలను

కొరవ 14వ పేజీలో

# జూద క్రీడ

మన జనానికి క్రికెట్ అంటే పిచ్చి. పనులు మానుకొని టీవీల ముందు తిష్ట వేస్తారు. వేసే ప్రతి బాలు, తీసే ప్రతి పరుగు మీదా చర్చోప చర్చలు. మరీ ట్వంటీ ట్వంటీ వచ్చిన తర్వాత క్రికెట్ ఆట తీరే మారిపోయింది. ఐపిఎల్ రంగ ప్రవేశంతో అదసలు ఆటగా కాకుండా జూదంగా రూపాంతరం చెందింది. క్రికెట్ ఆటగాళ్లను దేముళ్ల వలె ఆరాధిస్తారు మన పిచ్చి జనం. వారు కనపడితే చాలు వెర్రికేకలు పెడతారు. నూరు కోట్ల మంది ప్రజలు ఆరాధించి, అభి మానించడం కంటే ఏ క్రీడాకారుడికైనా జీవన సార్థకత వేరే వుండదు. కానీ దురదృష్టవశాత్తు క్రికెట్ క్రీడాకా రులు ఆ అభిమానం కంటే కరెన్సీ నోట్లు ఎక్కువ విలువ కల్గినవిగా భావిస్తున్నారు.

శ్రీశాంత్, విందూసింగ్, బిసిసిఐ ఛైర్మన్, ఇండియా సిమెంట్ శ్రీనివాసన్ అల్లుడు గురునాథ్... ఇట్లా క్రికెట్ బెట్టింగ్ జూదం ఆడుతూ బొంబాయి పోలీసులకు దొరికిపోయిన, దొరికి పోతున్న క్రికెట్ వీరులను చూస్తుంటే అసహ్యం పుడుతున్నది. శ్రీశాంత్ ప్రతిభ కల్గిన క్రీడాకారుడు. ఐపిఎల్ జట్టులో ఆడుతున్నందుకు అతడికి కోట్ల రూపాయల పారితోషికం ముడుతున్నది. అది కాక, ప్రకటనల రూపంలో కూడా కొల్లలుగా డబ్బు వచ్చి పడుతున్నది. అయినా ఆశ తీరక బెట్టింగ్ జూద రుల చెరలో చిక్కుకపోయాడు. ఇప్పుడు శాశ్వతంగా చెరసాలలో మ్రగ్గబోతున్నాడు.

ఇండియా సిమెంట్ శ్రీనివాసన్ పేరున్న పారిశ్రామికుడు. దక్షిణ భారత దేశంలో ఒక స్థాయి అంతస్తు కల్గినవాడు. బిసిసిఐ బోర్డు అధ్యక్షత అంటే ఎంత గొప్ప పదవో దాన్ని అనుభవించే వారికే తెలుస్తుంది. కేంద్ర మంత్రులు, పైస్థాయిలో వుండే రాజకీయవాదుల కంటే బిసిసిఐ అధ్యక్షుడికి ప్రపంచంలో ఎక్కడికి వెళ్లినా గౌరవ మర్యాదలు లభిస్తాయి. ఆయన అల్లుడు బెట్టింగ్ జూదంలో పాలు పంచుకొన్నాడన్న వార్త క్రికెట్ అభిమానులందరినీ కలత పెడుతున్నది.

ప్రజల క్రీడా మమకారాన్ని జూదంగా మార్చుచూడడం ఘోరమైన నేరం. మన దేశంలో ఒక్క గుర్రాల రేస్‌కు తప్ప మరే క్రీడకూ బెట్టింగ్ అనుమతి లేదు. భారత దేశాన్ని సర్వనాశనం చేయాలని కంకణం కట్టుకొని పని చేస్తున్న దావూద్ ఇబ్రహీం, ఛోటా రాజన్, ఛోటా షకీల్ వంటి ఆర్థిక ఉగ్రవాదులు దుబాయ్‌లోనో, పాకిస్తాన్ లోనో కూర్చుని దేశం మొత్తం మీద బెట్టింగ్ వ్యవస్థ నిర్మాణం చేస్తున్నారు. ఆట ఆడుతున్న కొద్ది సమయంలో కొన్ని వందల కోట్ల రూపాయల ప్రజల సొమ్మును లూటీ చేస్తున్నారు. మహానగరాల నుంచి మారు మూల పల్లె టూళ్ల వరకు క్రికెట్ బెట్టింగ్ నిరాఘాటంగా జరిగి పోతున్నది. దాన్ని నివారించడం ఏ పోలీసు అధికారికీ అలివి కావడం లేదు. దీనివల్ల దేశంలో దాదాపు ప్రతి రోజు కొన్ని వేల కుటుంబాలు ఈ వ్యసనం బారినపడి నాశనమై పోతున్నారు. కాపురాలు కుప్పకూలి పోతున్నాయి. ఆత్మ హత్యలు సర్వసాధారణమై పోతున్నాయి. ఈ మహమ్మారిని నిరోధించడం అంత సులభం కాదు. పైపెచ్చు ఈ జూదాన్ని పెద్ద క్రికెట్ క్రీడాకారులు, ఐపిఎల్ జట్టు స్వంతదారులు ఒక వ్యాపారంగా మార్చుకోడానికి చూస్తున్నప్పుడు ఈ వ్యసనాన్ని ఆపడం ఎట్లా సాధ్యం?

బెట్టింగ్ వల్ల ఐపిఎల్ క్రికెట్ పోటీలనే రద్దు చేయాలన్న కోరిక ఒకటి వినవస్తున్నది. అయితే అది సరైన పద్ధతి కాదు. ఎవరో కొందరి తప్పుడు తనానికి కోట్ల మంది ఆనందించే క్రీడను రద్దు చేయడం జరగని పని. అయితే క్రికెట్ బెట్టింగ్ విషయంలో ప్రభుత్వం, పోలీసు, క్రికెట్ సంఘాలు కొంత కఠినంగా వ్యవహరించడం తప్పనిసరి. ఆ జూదానికి లోబడినట్లు తెలిసిన వారిని శాశ్వతంగా క్రికెట్ క్రీడ నుంచి తరిమి వేయడంతో పాటు, కఠినమైన శిక్ష విధించాలి.

## జనవాణి

### బిజెపి కళ్లు తెరిపించేలా కర్నాటక ప్రజల తీర్పు!

మత పార్టీగా ముద్రపడినా దేశ సుస్థిరతకు కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా బిజెపి ఒకటుందని ఎదురుచూస్తున్న సమయంలో కర్నాటక ఎన్నికల్లో ఆ పార్టీకి శృంగభంగం కలిగేలా ప్రజలు తీర్పు ఇచ్చారు. బిజెపిలో పట్టుమని పది మంది జాతీయ నాయకులు లేరు. కాని ఆ పార్టీలో ఎన్నో లుకలుకలున్నాయి. బిజెపిని తుడిచి పెట్టేందుకు కారకుడైన రాజనాథ్‌సింగ్‌ను మళ్లీ జాతీయ అధ్యక్షుడిని చేశారు. దక్షిణాది రాష్ట్రాలలో ఆ పార్టీ పుంజుకొనే అవకాశం పార్టీ నాయకులు ఇవ్వకుండా బిజెపిని ఉత్తరాది పార్టీనే చేశారు. సుస్థిరత, అభివృద్ధికే తప్ప వ్యక్తులకు ఓట్లేయమని కర్నాటక ప్రజలిచ్చిన తీర్పు దేశ ప్రగతిని కోరే ప్రతి పౌరుడు హర్షిస్తాడు.

ఎన్.రామచంద్రారెడ్డి — చెన్నై

### సమ్మె మాత్రమే జన్మహక్కు?

ఎవరిచ్చారు వీళ్లకు ఈ హక్కు. ఈ మధ్య బాధ్యతా రాహిత్యంగా ప్రభుత్వోద్యోగులు, బ్యాంకులు, వకీళ్లు, వైద్యులు, వార్తాహరులు, కార్మికులు, తదితర సంఘాలు ధర్నాలు, సమ్మెలు, పెన్‌డౌన్ స్ట్రైకులను చేస్తున్నారు. ప్రజా జీవనాన్ని స్తంభింప జేస్తున్నారు. అస్తవ్యస్తం చేస్తున్నారు. దేశ అభివృద్ధిని కుంటు పరుస్తున్నారు. వీళ్లంతా ప్రజా సేవకులు, ప్రజలిచ్చే జీతాలు తీసుకొంటున్నారు. అయినా కొంచెమైనా జ్ఞానం, బాధ్యత లేకుండా ప్రవర్తిస్తున్నారు. అత్యవసర విధులు నిర్వర్తించే విద్యుత్, వైద్య, బ్యాంకు, రవాణా శాఖలవారు కూడా ఇలానే నిర్వాకం జరుపుతున్నారు. ఈ దుర్నీతి, దురన్యాయాన్ని, దుష్ట నికృష్ట కార్యాలను నిలువరించేందుకు చట్టాలను అమలు చేసి న్యాయస్థానాలైనా ఆపను చర్యలు తీసుకొంటే ప్రజలు సంతోషిస్తారు. ప్రజలు కూడా మనకెందుకులే ఎవరో వచ్చి ఏదో చేస్తారని ఎదురు చూడక, ఊరకుండక ధైర్యంగా ఎదుర్కొని వారు కలుగుజేసే అసౌకర్యాల నుండి బయటపడాలి. అప్పుడే సామాన్య జనానికి మనుగడ.

పి.అరుణకుమారి — నెల్లూరు

### జగన్ విమర్శలకు అతీతుడు కాదు!

ప్రజలు జగన్ వెంటే వున్నారని రాబోయే ఎన్నికలలో ఆయన్నే గెలిపించి సిఎం చేస్తారని 'జమీన్‌రైతు'లో కావలి నుంచి శాలి ఒక లేఖ వ్రాశారు. శాలి గారు అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. అయితే ఈ వ్యవహారంలో జగన్ గొప్పతనమేమీ లేదు. జగన్ గొప్ప ప్రజాసేవకుడేమీ కాదు. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి చేసిన మేళ్లు జగన్ పాలిట వరాలయ్యాయి. మన ప్రజలు అవినీతిని పెద్దగా పట్టించుకోరని లల్లూప్రసాద్ వ్యవహారం స్పష్టం చేసింది. జగన్ నెలల తరబడి జైల్లో వున్నాడు. ఆయనకు సుప్రీంకోర్టు కూడా బెయిల్ ఇవ్వలేదు. జగన్ వల్ల చాలామంది జైలు పాలయ్యారు. మరి జగన్ విమర్శలకు అతీతుడు ఎలా అవు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

28-5-1943
పేజీలు : 4 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

### పెళ్లిళ్ల పురాణాలు

యుద్ధం పుణ్యమా అంటూ అన్ని వస్తువులకు ధరలు పెరిగినట్లే పెళ్లి కొడుకుల ధర గూడా విపరీతంగా పెరిగింది. చదువుకొన్నవాడు, యువకుడు, కొంచెం యర్రతోలుగా వుందంటే యిక మార్కెట్‌లో ధర విపరీతంగా మోగిపోతున్నది. ఎంత పుచ్చు సరకు గూడా 20 వేలకు తక్కువ ధర బడదు.

గుర్రాల కుసుళ్లు, లక్షణాలు చూచి కొంటున్నారు, బర్రెలను అణ్ణేము సాంప్రదాయము విచారించి కొంటున్నారు, చివరకు యెద్దును కూడా పొరకుసుడి, మండపు చర్మము గాకుండా కొంటున్నారు. కానీ మానవులనే మనము, నవ నాగరికపు బురద బూసుకున్న మనము, వధువు – వరాన్వేషణలో యే శాస్త్ర, ఆచారాలను గమనించకుండా వివాహాలు చేసి దాని పాప ఫలాలను భుజిస్తున్నాము. ఎక్కడైనా ఒక పిల్ల వుందంటే ఆ కుటుంబం మంచి చెడ్డలు, ఆచార వ్యవహారాలు, సాంప్రదాయ మర్యాదలు, జాతక లక్షణాలు, యీడుజోడులు, ఇవేమీ చూడకుండానే "ఎన్ని వేలిస్తారో కనుక్కో" మనడం బేరం కుదిరిందంటే తక్షణమే ముహూర్త నిర్ణయం, డబ్బు దట్టుకోవడం, యిది చివరకు తేలిన హిందూ సాంప్రదాయ మర్యాద.

### పోలీసు సూపరెంటు!

కొత్త పోలీసు సూపరెంటు దేవరాజయ్యంగార్ 22వ తేది ఛార్జి తీసుకున్నారు. పాత సూపరెంటు ప్రజ్ఞాధిక్యాలను అభినందించనందుకు క్షమించండి.

–విమర్శకుడు

## 50 ఏళ్ల క్రితం ఈవారం

24-5-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### శ్రీమతి కనకమ్మ గారు

శ్రీమతి పొణకా కనకమ్మ గారిని ఈ వారంలో వేలూరుకు తీసుకొనిపోయి వైద్య సలహా పొంది వచ్చారు. ఆమె ఆరోగ్యంలో ఏమీ మార్పులేదు.

### వీరారెడ్డి సత్రం

వాకాటి వీరారెడ్డి సత్రం కమిటీ సర్వసభ్య సమావేశం 9-6-1953వ తేది సాయంత్రం 4 గంటలకు తన బంగళాలో జరుగుతుందని; కొత్త కార్య నిర్వాహకవర్గం ఎన్నిక, భవన మరమ్మత్తులు ముఖ్య చర్చనీయాంశాలని, సభ్యులందరూ హాజరు కావలసిందని కార్యదర్శి రేబాల లక్ష్మీనరసారెడ్డి గారు కోరుతున్నారు.

### అస్లాం – కుర్షీద్ బేగం

స్వాతంత్ర్యాత్పూర్వం శాసనసభ్యుడు, పాతికేళ్లుగా మునిసిపల్ కౌన్సిలర్ పదవిని వహిస్తున్న సౌమ్యుడైన డాక్టర్ సలాంగారి కుమారుడు; విదేశ విద్యా పారంగతుడు, కర్నాల్ పాడి పరిశ్రమ కేంద్రంలో రిసెర్చ్ అసిస్టెంటుగా వున్న అస్లాం బిఎస్‌సి, ఐడిఐ, డిసి(డెన్మార్కు)కు; నెల్లూరు సైకిల్ వ్యాపారి, కందుకూరు సినిమా యజమాని అయిన జనాబ్ అహ్మద్ బాషా సాహెబ్ కుమార్తె సౌభాగ్యవతి కుర్షీద్‌బేగంకు వరుని యింట 21వ తేది వివాహ మహోత్సవం జరిగింది. ముఖ్యమంత్రి సంజీవరెడ్డి, మంత్రులు ఏ.సి.సుబ్బారెడ్డి, డాక్టరు చెన్నారెడ్డి, ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు బ్రహ్మయ్య మున్నగు పెద్దలు నిఖాకు హాజరై ఆశీర్వదించారు. సలాం 21వ తేది రాత్రి ఆహూతులందరికీ పలావ్ విందు చేశారు.

# నెల్లూరు ముచ్చట్లు
## విశేషాలు

### కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి స్వంత ఆఫీసు!

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో ఒక నాయకుడంటే మరో నాయకుడికి పడడం లేదు. నెల్లూరు విజయమహల్ గేటు వద్ద రాజన్నభవన్ నుంచి ఇటీవల వరకు కార్యకలాపాలు నిర్వహించిన కాకాణి గోవర్ధన్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, అనిల్‌కుమార్ యాదవ్‌లు ఎవరికి వారే విడివిడిగా కార్యాలయాలు పెట్టుకున్నారు. రాజన్నభవన్‌ను అనిల్‌కుమార్ యాదవ్ అట్టిపెట్టుకోగా, కాకాణి గోవర్ధన్‌రెడ్డి కలెక్టర్ బంగ్లా ప్రక్కన స్వంత ఆఫీసు పెట్టుకొన్నారు. వీరితో ఏమయ్యిందో ఏమో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి మాగుంట లేఅవుట్‌లోని ఆంధ్రాబ్యాంక్ ప్రక్కన సరికొత్త కార్యాలయాన్ని చకచకా నిర్మించేశారు. దీన్ని ఈ నెల 29వ తేది ప్రారంభిస్తున్నారు. కార్పొరేషన్ ప్లాన్ గట్రా ఆమోదింపజేసుకొని మరీ ఈ కార్యాలయపు పనులు శ్రీధర్‌రెడ్డి మొదలు పెట్టడం విశేషం.

### మళ్లీ పెరిగిన బియ్యం ధరలు!

నెల్లూరులో బియ్యం ధరలు మళ్లీ పెరిగిపోయాయి. జిలకర మసూరి టాప్ క్వాలిటీ కిలో 50 రూపాయలు, రెండవ రకం 48 రూపాయలు అమ్ముతున్నారు. కిలో నలభై రూపాయలు అమ్ముతుండిన బియ్యం రేట్లు మళ్లీ ఎందుకు పెరిగాయో అర్థమే కావడం లేదు. ప్రభుత్వం రైతు బజార్లలో కిలో 30 రూపాయలకు అందుబాటులో పెడతామని ప్రకటించిన సన్న బియ్యం పథకం నెల్లూరులో అట్టర్ ప్లాప్ అయ్యింది.

### జగన్‌కు బెయిల్ రావడం కష్టమే!

అనారోగ్యం నుంచి కోలుకున్న నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి స్వరం పెంచారు. వైఎస్ జగన్మోహన్‌రెడ్డికి బెయిల్ రావడం కష్టమని 19వ తేది నెల్లూరులో విలేకరులతో చెప్పారు. పదివేల కోట్ల రూపాయలు తిన్న జార్ఖండ్ ముఖ్యమంత్రి మధుకోడా బెయిల్ దొరక్క రెండేళ్లుగా జైలులో వున్నాడు. లక్ష కోట్ల రూపాయలు తిన్న జగన్‌కు బెయిల్ ఎలా వస్తుందన్నారు. పనిలో పనిగా తెలుగుదేశం సర్వాధినేత నారా చంద్రబాబు నాయుడిని విమర్శించారు. మోకాళ్లు అరిగిన చంద్రబాబు నాయుడితో కలవాల్సిన అవసరం కాంగ్రెస్ పార్టీకి లేదన్నారు.

### నెల్లూరు నగర బ్లాక్ కాంగ్రెస్ అధ్యక్షులు!

నెల్లూరు నగర బ్లాక్ కాంగ్రెస్ అధ్యక్షులుగా యాలమూరి రంగయ్య నాయుడు, కొణిదల సుధీర్ నియమితులయ్యారు. వీరిలో రంగయ్య నాయుడు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మనిషి. సుధీర్ సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణా రెడ్డి స్వంత మనిషి కావడం విశేషంగా చెప్పుకోవాలి.

### నెల్లూరులో కెవిపి!

రాజ్యసభ సభ్యుడు కెవిపి రామచంద్రరావు 19వ తేది నగరంలో మరణించిన తన బంధువు ఇంటికి పరామర్శకు సతీసమేతంగా వచ్చారు. హైదరాబాద్‌కు తిరిగి వెళ్లే సమయంలో ఆనం వివేకానందరెడ్డి, ఆయన కుమారులు ఎసి సుబ్బారెడ్డి, రంగమయూర్‌రెడ్డిలు రైల్వేస్టేషన్‌లోని రెస్టారూంలో కెవిపిని కలసి మాట్లాడారు.

### కార్పొరేషన్‌కు కొత్త కమిషనర్!

నెల్లూరు కార్పొరేషన్ కమిషనర్‌గా శాంసన్ నియమితులయ్యారు. ఈయన కడప కార్పొరేషన్ కమిషనర్‌గా పని చేస్తూ నెల్లూరుకు బదలీ అయ్యారు. నెల్లూరుకు రాను హేమాహేమీలు పోటీపడ్డా ఆనం బ్రదర్స్ శాంసన్ వైపే మొగ్గు చూపారు.

### యువజన కాంగ్రెస్ నేత రౌడీయిజం!

గతంలో యువజన కాంగ్రెస్ అధ్యక్షులుగా వ్యవహరించిన నేతలంతా హుందాగానే ఈ పదవిని నిర్వహించారు. ప్రస్తుత యువజన కాంగ్రెస్ నేతగా ఉన్న మేఘనాథ్‌సింగ్ దుందుడుకుగా వ్యవహరిస్తూ ఆ పార్టీని గబ్బుపట్టిస్తున్నాడు. రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి నెల్లూరు తిరిగి రాకను పురస్కరించుకొని బసోటా హోటల్‌లో మేఘనాథ్‌సింగ్ ఇచ్చిన మందు పార్టీలో నిషా తలకెక్కిన ఆయన బంధువు యశ్వంత్‌సింగ్ హోటల్‌లోని దీపాలంకరణ కుందెనలో సిగరెట్ వెలిగిస్తుండగా అడ్డుకొన్న హోటల్ నిర్వాహకులు మురళి, వంశీకృష్ణపై మేఘనాథ్ సింగ్ బృందం దాడి చేశారట. పోలీసులు ఈ కేసును పెద్దగా పట్టించుకోకపోవచ్చు. ప్రజల్లో మాత్రం యువజన కాంగ్రెస్ చులకనై పోతుంది సింగ్ భాయ్.

### ఆరోగ్య అధికారికి వివేకా అభయం!

నెల్లూరు కార్పొరేషన్ ఆరోగ్య అధికారిగా అనుమసముద్రం పేట ప్రాథమిక ఆరోగ్య కేంద్రం డాక్టర్ వెంకటరమణ నియమితులయ్యారు. ఈ బదలీ తనకు తెలియకుండా జరగడంతో పాత ఆరోగ్య అధికారి సుబ్బరాజును రిలీవ్ కావద్దని రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి హుకుం జారీ చేశారట. దీంతో ఆయన ఇక్కడ రిలీవ్ కాకుండానే తడలో బాధ్యతలు స్వీకరించినట్లు డ్రామా మొదలు పెట్టాడు.

### రోడ్డు మార్జిన్ వ్యాపారుల తొలగింపు!

నెల్లూరు నగరంలో ట్రాఫిక్ ఆగిపోవడానికి కారకులవుతున్న రోడ్డు మార్జిన్ వ్యాపారులను ట్రాఫిక్ పోలీసులు తొలగించారు. మద్రాస్ బస్టాండ్ వద్ద గల ఎసి కూరగాయల మార్కెట్ ముందు బుట్టల్లో పెట్టుకొని కూరగాయలు అమ్ముకొంటుండిన వారిపై సైతం ట్రాఫిక్ సిఐ బొట్టు వెంకటేశ్వర్లు ఉక్కు పాదం మోపారు. వాస్తవానికి వీరంతా ట్రాఫిక్ పోలీసులకు ప్రతి రోజూ చిల్లర ఖర్చులకు అవసరమయ్యే మొత్తాలను లంచాలుగా ఇస్తారు. ఎన్నాళ్లు వీళ్ల అంగళ్లు పెట్టకుండా ట్రాఫిక్ పోలీసులు చూస్తారో చూద్దాం మరి.



పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో మంచి మార్కులు సాధించిన స్కూల్ విద్యార్థినీ, విద్యార్థులతో రవీంద్రభారతి విద్యాసంస్థల ఛైర్మన్ ఎం.ఎస్.మణి.

### కార్పొరేషన్ ఎస్ఇగా ఇమాముద్దీన్!

నెల్లూరు కార్పొరేషన్ సూపరింటెండెంట్ ఇంజనీర్‌గా ఇమాముద్దీన్ నియమితులయ్యారు. ఈయన ప్రస్తుతం రాజమండ్రి కార్పొరేషన్‌లో ఎస్ఇగా పని చేస్తున్నారు. ఇమాముద్దీన్ నెల్లూరుకు పాతకాపే. మునిసిపల్ ఇంజనీర్‌గా, ఇన్‌ఛార్జ్ ఎస్ఇగా, ఇన్‌ఛార్జ్ మునిసిపల్ కమిషనర్‌గా పనిచేసిన అనుభవశాలి.

### నిప్పో సెంటర్‌లో మహిళకు బురిడీ!

నెల్లూరు నిప్పో సెంటర్‌లో ఆటో దిగి వెళ్తున్న మహిళను పోలీసులమని చెప్పి ఆమె దగ్గరున్న ఎనిమిదిన్నర సవర బంగారు నగలు దొంగలు తిరుగుతున్నారని మూట కట్టించి దాన్ని పట్టుకెళ్లిపోయారు. ఆలస్యంగా విషయం తెలుసుకొన్న అడివిశెట్టి వెంకట సుబ్బమ్మ ఐదవ పట్టణ పోలీసులను ఆశ్రయించింది. ఈ ఉదంతం నగలు ధరించి రోడ్లపైకి వచ్చే మహిళలు జాగ్రత్తగా ఉండాలని తెలియ చెబుతుంది.

### డికె కాలేజికి కొత్త ప్రిన్సిపాల్!

నెల్లూరు డికెడబ్ల్యు ప్రిన్సిపాల్‌గా టి.సాంబయ్య బాధ్యతలు స్వీకరించారు. రాపూరు జూనియర్ కాలేజి ప్రిన్సిపాల్‌గా పనిచేస్తూ ఇక్కడకు వచ్చారు. గతంలో ఎంతో కీర్తి కలిగిన డికెడబ్ల్యు కాలేజీని కొత్త ప్రిన్సిపాల్ మంచి బాట నడపాల్సి ఉంది.

### కవి సమ్మేళనంలో నెల్లూరు కవులు!

ఆన్ ఫైర్ వెబ్ పత్రిక బెంగుళూరులోని నయన ఆడిటోరియంలో 20వ తేది నిర్వహించిన బహుభాషా కవి సమ్మేళనంలో నెల్లూరు కవులు పెరుగు రామకృష్ణ, డాక్టర్ సరోజాదేవి పాల్గొన్నారు. వీరిద్దరూ కలిసి వ్రాసిన 'ఇట్ హ్యాపెన్స్' కవితకు రెండో బహుమతి లభించింది. వీరికి కవయిత్రి ఫాకియా వాజిద్ జ్ఞాపిక, ప్రశంసాపత్రంతో సన్మా

కొరవ 14వ పేజీలో

# డైకస్‌రోడ్డులో మాంసం మార్కెట్!

## శంకుస్థాపన చేసిన జంట ఎమ్మెల్యేలు!



నెల్లూరు డైకస్‌రోడ్డులోని సందాని బాష చేపల మార్కెట్ ప్రక్కన కొత్తగా నిర్మించ తలపెట్టిన మాంసం మార్కెట్‌కు 17వ తేది జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డిలు శంకుస్థాపన చేశారు. అనంతరం వివేకానందరెడ్డి మాట్లాడుతూ కోటి 84 లక్షల రూపాయల ఖర్చుతో ఈ మార్కెట్‌ను నిర్మిస్తామన్నారు. గతంలో ఇచ్చిన హామీ మేరకు మాంసం, చేపల మార్కెట్ ఏర్పాటు చేస్తున్నామన్నారు. ప్రస్తుతం ఈ ప్రాంతంలో రోడ్డు ప్రక్కన కూరగాయలు విక్రయించే వారి కోసం విడిగా మార్కెట్‌ను, ముస్లింల కోరిక మేరకు ఘోషా ఆసుపత్రిని నిర్మిస్తామన్నారు. సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి మాట్లాడుతూ నెల్లూరు నగరంలో ప్రస్తుతం జరుగుతున్న అభివృద్ధి గతంలో ఎన్నడూ జరగలేదన్నారు. బారాషహీద్ దర్గా అభివృద్ధికి ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి పది కోట్ల రూపాయలు మంజూరు చేయించారన్నారు. రాబోయే కార్పొరేషన్ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీకే పట్టం కట్టి అభివృద్ధికి దోహదపడాలని ప్రజలను కోరారు. ఈ కార్యక్రమంలో చాట్ల నరసింహారావు, ఆనం రంగమయూర్‌రెడ్డి, షఫీ, జరీనా సుల్తానా, జకీర్ పాల్గొన్నారు.

# మేరిగ మురళి గాడిలో పడ్డాడు!

## ● సమన్వయకర్తలను కలుస్తున్న వైకాపా కన్వీనర్

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ జిల్లా కన్వీనర్ మేరిగ మురళి 16వ తేది నెల్లూరు రూరల్ నియోజకవర్గం సమన్వయకర్త కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డిని ఆయన నివాసంలో కలిసి పుష్పగుచ్ఛం అందించారు. ఈ సందర్భంగా మేరిగ మురళి మాట్లాడుతూ తాను కన్వీనర్‌గా నియమితుడయ్యాక జిల్లాలోని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నియోజకవర్గ సమన్వయకర్తలందరినీ కలిసి వారి సహకారం అభ్యర్థిస్తున్నానన్నారు. ప్రజల కోసం నిరంతరం పనిచేసింది వైఎస్ కుటుంబం అని ముఖ్యమంత్రిగా అనేక సంక్షేమ పథకాలు ప్రవేశపెట్టాడని, కానీ నేటి ప్రభుత్వం ఆ సంక్షేమ పథకాలను సర్వనాశనం చేసి కేవలం ప్రచార ఆర్భాటాలకు పరిమితం అవుతూ ప్రజలకు కల్లబొల్లి మాటలు చెబుతూ కాలయాపన చేస్తుందని, ఈ ప్రభుత్వానికి పోయేకాలం దాపురించిందని, రాష్ట్రంలో ఎప్పుడు ఎన్నికలు జరిగినా జగన్మోహన్‌రెడ్డి నాయకత్వంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ఘన విజయం సాధించి దేశ రాజకీయాలలో చరిత్ర సృష్టించి జగన్మోహన్‌రెడ్డి ముఖ్యమంత్రి కావడంతోపాటు కేంద్రంలో కూడా కీలక పాత్ర పోషిస్తాడని మేరిగ మురళి జోస్యం చెప్పారు.



కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డిని కలిసిన వైకాపా జిల్లా కన్వీనర్ మేరిగ మురళి.

# భానుడి భగభగలు!

● నిర్మానుష్యంగా నెల్లూరు రోడ్లు



మాగుంట విగ్రహం సెంటర్‌లో ఎండకు రోడ్డు నిర్మానుష్యం.

నెల్లూరు నగరం రామగుండంగా మారుతోంది. గతంలో ఎన్నడూ లేని విధంగా ఎండలు రోజురోజుకు మండుతుండడం, ఉష్ణోగ్రతలు పెరిగి పోతుండడంతో అత్యధిక వేడి ప్రాంతంగా, ఉష్ణోగ్రత అధికంగా వుండే ప్రాంతంగా చెప్పబడే రామగుండం, కొత్తగూడెంతో సమాన స్థాయికి నెల్లూరు చేరింది. రికార్డు స్థాయిలో ఉష్ణోగ్రతలు నమోదవుతుండడంతో ప్రజలు ఆందోళన చెందుతున్నారు. వారం, పది రోజులుగా రోజురోజుకు పెరుగుతూ వస్తున్న ఉష్ణోగ్రత మధ్యలో ఒకటి రెండు రోజులు తగ్గినట్లు కన్పించినా క్రమేణా భానుడి ప్రతాపం తీవ్రరూపం దాల్చడంతో బయట తిరగాలంటేనే జనం భయపడి పోతున్నారు. మే నెల 11వ తారీఖున అత్యధికంగా 44.4 డిగ్రీల గరిష్ఠ ఉష్ణోగ్రత నమోదయ్యిందంటే ఎండలు ఎంతగా పెరిగి పోతున్నాయో అర్థమవుతుంది. ఆ తర్వాత ఎండ 45 డిగ్రీలకు చేరుకొంది. ఒకవైపు బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడిందని అధికారులు చెబుతున్నా నెల్లూరులో ఆ ఛాయలే కన్పించక, మరింతగా భానుడు చంద్రనిప్పులు కక్కుతున్నాడు. దీంతో ఉదయం 10 గంటలకల్లా నగరంలో రోడ్లన్నీ నిర్మానుష్యంగా మారుతున్నాయి. ఎక్కడచూసినా రోడ్లన్నీ బోసిపోయి అప్రకటిత కర్ఫ్యూ వాతావరణాన్ని తలపిస్తోంది. పెరుగుతున్న ఉష్ణోగ్రతలకు తోడు ఉక్కపోత భరించలేకుండా వుంటుండడంతో పెద్దలు, పిల్లలు అల్లాడుతున్నారు. వడదెబ్బకు గురై మరణించిన వృద్ధుల సంఖ్య ఈ వారంలో అధికంగానే వుంది. పలువురు ఆస్పత్రుల్లో చికిత్స పొందుతున్నారు. వేడిమి నుంచి ఉపశమనం పొందేందుకు, దప్పిక తీర్చుకునేందుకు ఐస్‌క్రీమ్ షాపులు, కూల్‌డ్రింక్, జ్యూస్ షాపుల వద్ద అధిక సంఖ్యలో జనం గుమిగూడుతున్నారు. కొందరు ఎండకు తాళలేక సేద తీరేందుకు అనుకూలంగా వుండే సినిమా హాళ్లను ఆశ్రయిస్తున్నారు. నగరంలో పెరిగి వున్న పచ్చని చెట్లను కరెంటు డిపార్టుమెంటు ఒకవైపు, రోడ్డు వెడల్పు చేస్తూ మరో వైపు తెగనరకడంతో పచ్చదనం కరువై, ముందు ముందు ఇంకెంతగా ఉష్ణోగ్రతలు పెరిగి పోతాయోనని ఆందోళన చెందుతున్నారు.

# రూరల్ నియోజకవర్గంలో నీటికి కటకట!

నెల్లూరు రూరల్ నియోజకవర్గంలోని అనేక ప్రాంతాలలో ప్రజలు మంచినీటి కోసం తీవ్ర ఇబ్బందులు పడుతున్నారని బిందెడు నీళ్లకోసం నానాపాట్లు పడుతున్నారని వైకాపా సమన్వయకర్త కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి ఆరోపించారు. ఈ విషయమై ఆయన మాట్లాడుతూ ప్రజలు దాహార్తితో బాధ పడుతున్నా అధికార పార్టీ శాసనసభ్యులకు ఈ విషయం కనపడక పోవడం విచిత్రంగా వుందన్నారు. బుజబుజనెల్లూరు, కొత్తూరు, కల్లూరుపల్లి హౌసింగ్‌బోర్డు కాలనీ ప్రాంతంలో తాగునీటి సమస్య తీవ్రంగా వుందన్నారు. అభివృద్ధికి వందల కోట్ల రూపాయలు తెస్తున్నామని అధికార పార్టీ ఎమ్మెల్యేలు చెబుతున్న మాటలు ఉత్తర కుమార ప్రగల్భాలుగా మిగులుతున్నాయన్నారు. వేసిన రోడ్ల మీద రోడ్లు వేయడం, ప్రధాన రహదారులలో సెంట్రల్ లైటింగ్ పెట్టడం అభివృద్ధి కాదని, సామాన్య ప్రజలు నివాసం వుండే అనేక ప్రాంతాలలో కనీసం వీధిలైట్లు వెలగడం లేదని, త్రాగునీటి కోసం ప్రజలు నానా బాధలు పడుతున్నారని పారిశుద్ధ్యం అధ్వాన్నంగా మారిపోయిందని, అధికార పార్టీ శాసనసభ్యులకు చిత్తశుద్ధి ఉంటే ఈ సమస్యలపై దృష్టి సారించాలని కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి హితవు పలికారు. ఈ కార్యక్రమంలో ఆయన వెంట నెల్లూరు రూరల్ మండల కన్వీనర్ పిగిలం సురేష్‌యాదవ్, నగళ్ల రామకృష్ణ యాదవ్, సందాని, పెంచలయ్య, ప్రసాద్, కుమార్, కృష్ణంరాజు, సిద్ధయ్య, రామారావు, మౌలాబాషా, హమీద్, బాబాసాహెబ్ పాల్గొన్నారు.



సమస్యలు అడిగి తెలుసుకొంటున్న శ్రీధర్‌రెడ్డి.


SSC-2013
No.1
10/10
A.P. లో A1 స్కూల్
ఎడ్యుకేషన్‌లో రివల్యుషన్... రిజల్ట్స్‌లో ఆల్వేస్ సెన్సేషన్...
స్కూల్ విద్యలో ఎవర్‌గ్రీన్ ఛాంపియన్...
రవీంద్రభారతి స్కూల్
SSC 2013 GPA
10/10 A. Sai Poojitha HT.NO. 1336109020
10/10 Akhila H.T.NO. 1337106058
10/10 Dasari Sri Sandhya H.T.NO-1318103336
10/10 Meduri Reddy Sushma H.T.No.1318123474
10/10 P. Abhiram H.T. No. 1317102352
10/10 P. Sreenija H.T.NO-1322140397
10/10 P. V. Bindu Bhargavi H.T. No. 1317102218
10/10 S. Pranay Reddy H.T. No. 1337107087
10/10 Sai Praveen H.T. No. 1318122100
10/10 T. Deepthi H.T. No. 1317101098
10/10 V.Ravi Kumar H.T. No. 1305100436
రవీంద్రభారతి విద్యార్థుల GPA మరియు సబ్జెక్టుల గ్రేడింగ్ పర్సంటేజ్
A1 & A2 గ్రేడ్ సాధించినవారు 52%
MATHS A1 86%
SCIENCE A1 72%
drusya
Ithaka International School
Knowledge Drives
Near Kanuparthipadu, Golgamudi Road, Nellore. Ph : 0861- 6521111 / 3333. www.ithaka.in
Ravindra Bharathi Global School
Giving Wings to Thoughts
CBSE schools @ Bengaluru & Chennai
www.rbglobalschools.in
For an International Pre-Schooling Experience !
Ithaka Early Learning Centre
The quest continues...
Admissions for Toddler, Nursery, PP I & PP II
Plot # 1248, Road # 62, Lane Beside Heritage Fresh, Jubilee Hills, Hyderabad. A.P. India. Tel: 040-23556616/17.
Super Special Batch (SSB) A/C Campus
Madhapur, Hyderabad.
Ph: 8096699718
VI to X Classes
Separate A/c Hostel for Boys & Girls with most hygienic and delicious food
మా రెసిడెన్షియల్ క్యాంపస్‌లు
హైదరాబాద్ -హస్తినాపురం, కోదాడ(నల్గొండజిల్లా), కర్నూలు, అనంతపురం, కడప, తిరుపతి, నెల్లూరు, గుంటూరు, విజయవాడ-మొగల్‌రాజపురం, రాజమండ్రి, వైజాగ్-ద్వారకానగర్.
ఇంతటి ఘన విజయానికి కారకులైన విద్యార్థులకు, తల్లిదండ్రులకు మరియు ఉపాధ్యాయులకు మా హృదయపూర్వక శుభాకాంక్షలు..
అడ్మిషన్లు జరుగుచున్నవి. నర్సరీ నుండి 10వ తరగతి వరకు
RAVINDRA BHARATHI SCHOOLS :
NELLORE : Fathekhanpet : Mbl.: 8096699522, Nawabpet : Mbl.: 8096810448, Vedayapalem : Mbl.: 8096952232, KAVALI: Mbl.: 8096699744, GUDUR : Mbl.: 8096810449, NAIDUPET : Mbl.: 8096810450, SULLURPET : Mbl.: 8096810451, ATMAKUR : Mbl.: 8096952246.
RESIDENTIAL SCHOOL : NELLORE : Fathekhanpet : 8096609322
OLYMPIAD SCHOOLS : NELLORE : Fathekhanpet : Mbl.: 8096699504. Nawabpet : Mbl.: 8096952295. Vedayapalem : Mbl.: 8096922177
Ravindra Bharathi School
New Concept, Old Values.
Andhra Pradesh
www.rbschools.in



218 రోజులు పాదయాత్ర చేసి రికార్డు సృష్టించిన తెలుగుదేశం పార్టీ సర్వాధినేత చంద్రబాబు నాయుడిని హైదరాబాద్‌లో కలసి అభినందించిన నెల్లూరు కాకతీయ సేవాసమితి అధ్యక్షుడు రావి మోహన్ చౌదరి.



బోగోలు ఎమ్పీడిఓ ఆఫీసులో సూపరింటెండెంట్‌గా పనిచేస్తూ బదలీ అయిన గురుప్రసాద్, పంచాయితీరాజ్ విస్తరణాధికారి పరంధామయ్యల అభినందన సభలో ఎమ్పీడిఓ కనకదుర్గా భవానీ తదితరులు.

# బోగోలు ప్రజలకు అందని రేషన్‌సరుకులు!

ప్రభుత్వం పేదల కోసం పలు పథకాలు రూపొంది స్తున్నా, తక్కువ ధరకు సరుకులను ఇస్తున్నా అవి ప్రకటనలకే పరిమితం అవుతున్నాయి తప్ప పేదలకు అందడం లేదు అనేందుకు బోగోలు మండలం ఉదాహరణ. ఈ ప్రాంతంలో మొత్తం 36 రేషన్‌షాపులు వున్నాయి. ప్రభుత్వపరంగా పేద లకు అందించే నెలవారి సరుకులు ఈ షాపులగుండా అం దాల్సి వున్నప్పటికి అదెక్కడా అమలుకావడం లేదు. అమ్మ హస్తం పేరుతో ప్రభుత్వం కొత్తగా ప్రారంభించిన రేషన్ సరు కుల ప్యాకేజి తెల్లకార్డుదారులకు అందకపోతుండడంతో పేదలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఒక్క ఐదవ నెంబర్

## డీలర్లు మహా మాయగాళ్లు

రేషన్‌షాపు నిర్వాహకురాలు గిరిజ అనే డీలర్ మాత్రం ప్రభు త్వం నిర్దేశించిన ప్రకారం సరుకులు అందిస్తుండగా, మిగతా షాపుల్లో సక్రమంగా అందడం లేదని ఆయా ప్రాంతాల ప్రజలు అధికారులకు ఫిర్యాదు చేస్తున్నారు. పేదల కోసం పథకాలని చెప్పి హామీలు ఇచ్చి చేతులు దులుపుకొనే ప్రజా ప్రతినిధులు, ఆర్భాటపు ప్రకటనలు చేసే పౌరసరఫరాల శాఖాధికారులు ఈ విషయమై దృష్టి పెట్టాలని బోగోలు మండల ప్రజలు కోరుకొంటున్నారు.

# దొంగలున్నారు జాగ్రత్త!

## వెంకటగిరి సిఐ ప్రచారం

వేసవి కాలంలో దొంగతనాలు అధికంగా జరుగు తున్నందున ఈ విషయమై ప్రజలు అప్రమత్తంగా వ్యవహరించాలని వెంకటగిరి సిఐ వై.శ్రీనివాసులరెడ్డి సూచించారు. ఇటీవల తన కార్యాలయంలో చోరీల నివా రణ పట్ల ప్రజలు తీసుకోవాల్సిన జాగ్రత్తలపై పోలీసులు ముద్రించిన కరపత్రాలను ఆయన ఆవిష్కరించారు. వేసవి కాలం కావడంతో సాధారణంగా అందరూ ఇంటికి తాళం వేసి ఆరుబయట నిద్రిస్తుంటారని దానిని అవకాశంగా చేసుకొని దొంగలు దొంగతనానికి పాల్పడుతుంటారని తెలి పారు. ఊర్లకు వెళ్లేవాళ్లు, ఇంటికి తాళం వేసి పోయేటప్పుడు సమీప పోలీస్‌స్టేషన్లో సమాచారం ఇవ్వాలన్నారు. జిల్లా ఎస్పీ రమణకుమార్, డిఎస్పీ చౌడేశ్వరి చోరీల నివారణకు తగిన చర్యలు చేపడుతున్నారని, అందులో భాగంగానే ప్రజలను జాగ్రత్తపరుస్తూ ఈ కరపత్రాలను ఇంటింటికి పంపిణీ చేస్తున్నట్లు తెలిపారు. ఈ కార్యక్రమంలో రాపూరు, బాలా యపల్లి, వెంకటగిరి ఎస్ఐలు సుధాకర్‌రావు, మంజూన్ సాహెబ్, అన్వర్‌బాషా తదితరులు పాల్గొన్నారు.

# విద్యుత్ స్టార్టర్ల చోరీ!

## అల్లాడుతున్న తోటపల్లి గూడూరు రైతులు

తోటపల్లి గూడూరు మండ లంలో చిల్లర దొంగతనాలు అధికమయ్యాయి. జులాయిగా పనీపాటా లేకుండా తిరిగే యువకులు ఒక ముఠాగా ఏర్పడి సులభంగా డబ్బు సంపాదించేం దుకు దొంగతనాలను మార్గంగా ఎంచు కోవడంతో ఇలాంటి దొంగతనాలు ఎక్కువయ్యాయి. ముఖ్యంగా విద్యుత్ స్టార్టర్లు, బారల్‌వైర్లు దొంగిలించేస్తు న్నారు. రాత్రి వేళల్లో సంచరిస్తున్న ఈ ముఠా పొలాల్లో రైతులు ఏర్పాటు చేసుకొన్న మోటార్ల వద్ద వీటిని దొంగి లించి అమ్ముకుంటుండడంతో రైతులు లబోదిబోమంటున్నారు. మండల పరిధి లోని కోదూరు, కొత్తకోదూరు, బాట, ఈదూరు, నెల్లిమిట్టకండ్రిగ, వెంకన్న పాళెం, పొట్లపూడి తదితర గ్రామాలలో 200కుపైగా స్టార్టర్లు దొంగిలించారు. ఒక్కొక్క స్టార్టర్ విలువ రెండువేల ఐదు వందల రూపాయలు వుంటుంది. విలు వైన ఈ పరికరాలు దొంగతనానికి గురౌ తుండడంతో రైతులు పోలీసులను ఆశ్ర యిస్తున్నారు. ఇటీవల ఈ ప్రాంతాలలో అపరిచిత వ్యక్తుల సంచారం అధికమ య్యింది. లైసెన్సులేని వాహనాలు అర్ధరాత్రిళ్లు తిరుగుతున్నాయట. రోజురోజుకు ఇలాంటి దొంగతనాలు అధికమవుతున్నా పోలీ సులు తగిన నిఘా పెట్టి దొంగలను పట్టుకోలేకపోతుండడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

# ఏడాది దాటినా అందని కూలీ!

## కావలి మార్కెట్ యార్డ్‌లో చిత్రం... విచిత్రం

ధాన్యం లోడింగ్‌కు సంబంధించి కూలీలకు అం దాల్సిన డబ్బులు ఏడాది గడుస్తున్నా అందని వైనం కావలి పట్టణంలో చోటు చేసుకొంది. స్థానిక వ్యవసాయ మార్కెట్ కమిటీ యార్డులో గత ఏడాది ప్రభుత్వం రైతుల నుంచి ధాన్యం కొనుగోలు చేసింది. ఈ ధాన్యాన్ని లోడ్ చేసినందుకు కూలీలకు నగదు చెల్లించాలి. దాదాపు 10వేల రూపాయలు కూలీ రూపంలో ఇవాల్సి వుండగా ఇంతవరకు ఒక్క రూపాయి కూలీలకు అంద లేదు. రోజు కూలీ పని చేసుకొని కుటుంబాలను పోషించుకొనే పేదలు, రెక్కాడితేగాని డొక్కాడని కూలీలు కూలీ డబ్బులు రాక పోవడంతో తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. దాదాపు 40 మంది కూలీలకు సంవత్సర కాలంలో ఈ మొత్తం నిలిచిపోవడం, సం బంధిత అధికారులు, మార్కెట్ కమిటి దీనిపై పట్టించుకోలేదని కూలీలు వాపోతున్నారు. ఇప్పటికైనా జిల్లా అధికారులు జోక్యం చేసుకొని బకాయి పడ్డ కూలీ డబ్బులను అందేలా చూడాలని కూలీలు కోరుకొంటున్నారు.

# వైద్య సేవలు గగనకుసుమం!

ఆరోగ్య కేంద్రాలను గాడిలో పెట్టేందుకు డిఎంహెచ్ఓ ఎంత ప్రయత్నిస్తున్నా సిబ్బందికి ఎన్ని హెచ్చరికలు చేస్తున్నా పరిస్థితిలో ఏ మాత్రం మార్పురావడం లేదు. చివరకు సమీక్షా సమావేశాల్లోను కొందరు సిబ్బంది ఎదురుతిరుగు తుండడం వారి నిర్లక్ష్య ధోరణిని తెలియజేస్తోంది. ఇటీవల డాక్టర్ మాసిలామణి వెంకటాచలం ఆరోగ్య కేంద్రాన్ని సందర్శించి సిబ్బంది నిర్లక్ష్యంపై మండి పడ్డారు. ఈ ఆరోగ్యకేంద్రంలో ముగ్గురు డాక్టర్లు, మరో ముగ్గురు స్టాఫ్‌నర్సులున్నా వైద్య సేవలు సక్ర మంగా అందడంలేదని వస్తున్న ఫిర్యాదులపై స్పం దించిన ఆయన దీనిని తనిఖీ చేశారు. జాతీయ రహ దారిని ఆనుకొని వున్న ఈ వైద్యశాలకు ప్రమాదా లకు గురైనవారు అత్యవసర వైద్యం కోసం వస్తుం టారన్నారు. అలాంటి వైద్యశాలల్లో సిబ్బంది అప్రమ త్తంగా వుంటూ విధినిర్వహణ చేయాలన్నారు. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు ఇంతవరకు ఒక్కటి కూడా జరగక పోవడంపై స్పందిస్తూ దీనిని

## వెంకటాచలం పిహెచ్‌సి పరిస్థితిది.

బట్టి వైద్యశాలపై ప్రజల్లో ఎంత నమ్మకం వుందో తెలుస్తున్నాదని మండిపడ్డారు. నర్సులు చివరకు యూనిఫాం వేసుకోవడానికి బద్ధకస్తులుగా మారా రని చురకలు అంటించారు. విధులకు హాజరు కాని వైద్యులకు మెమోలు ఇచ్చారు.

# సూళ్లూరుపేటలో కాజ్‌వే ధ్వంసం!

## చోద్యం చూస్తున్న అధికారులు

వాహనాలు గ్రామం గుండా వెళ్లరాదంటూ గ్రామస్తులు కాజ్‌వేను ధ్వంసం చేసిన ఘటన సూళ్లూరుపేటలో జరిగింది. జాతీయ రహదారి మీద వంతెన నిర్మించే ఉద్దేశంతో గతంలో అక్కడ వున్న పాత వంతెనను కూల్చేశారు. దీంతో గొల్లల మలుపు, గోపాలరెడ్డిపాళెం, పాములమిట్ట, వాటం బేడు గ్రామాల ప్రజలు, తడకు జాతీయరహదారి మీద వెళ్లాల్సిన వాహనాలు గ్రామం గుండా తిరగ డం ఆరంభించాయి. దీంతో ట్రాఫిక్ సమస్య ఏర్ప డింది. రద్దీ అధికం కావడంతో కొందరు గ్రామ స్తులు నెర్రికాలువ మీద వున్న కాజ్‌వేని జెసిబిలతో ధ్వంసం చేశారు. ఈ చర్యపై పలువురు నిరసన వ్యక్తం చేస్తున్నారు. భారీ వాహనాలు వెళ్లడంపై అభ్యంతరాలుంటే ప్రత్యామ్నాయ మార్గాలు ఆలోచించాలని, అధికారులతో మాట్లాడి సమస్య పరిష్కరించుకోకుండా లక్షల రూపాయలు ఖర్చు పెట్టి నిర్మించిన కాజ్‌వేని ధ్వంసం చేయడం ఏమి టని పలువురు ప్రశ్నిస్తున్నారు.



# DR. SRK. SCHOOL

(Recognised by the Govt of A.P.)
Magunta Layout, Nellore - 524 003. Ph: 2325199

**Parents' First Choice - విలువలతో కూడిన విద్యా సంస్థ**

ప్రతి విద్యార్థి ప్రగతే మా లక్ష్యం : : అత్యుత్తమ ఉపాధ్యాయులు - విద్యార్థుల మేలి కలయిక

## SSC Results - 2013



**SAKAMURI HARSHITHA**
GPA
STATE RANKER **10/10**

| No. | Name | Tel | Hin | Eng | Mat | Sci | SS | Grade |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | S.Harshitha | 10 | 10 | 10 | 10 | 10 | 10 | 10.0 |
| 2. | R.Surya | 10 | 9 | 10 | 10 | 10 | 10 | 9.8 |
| 3. | R.Varagayathri | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 4. | P.Dedeepya | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 5 | S.Navya | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 6. | M.Dhavanth | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 7. | G.Sumadhura | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 8. | A.Venkata Sai Dheeraj | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 9. | S.Divya | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 10. | B.Akhila | 10 | 9 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 11. | Syed Saidsh Basha | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 12. | D.Hema Manvi | 10 | 9 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 13. | M. Praneetha | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 14. | P. Sai Chaitra | 10 | 10 | 9 | 10 | 10 | 9 | 9.7 |
| 15. | G. Enoch Sajeev | 10 | 9 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 16. | R. Samyuktha | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 17. | V. Ramya Deepika | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 18. | A. Tejasree | 10 | 9 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 19. | B. Kishna Bharadwaj | 10 | 9 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 20. | A. Nitheesh | 10 | 9 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 21. | P. S.V Mohana | 9 | 10 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 22. | S. Bindu Madhavi | 10 | 9 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 23. | B.Kavya Reddy | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 24. | M.Sathaya Sai Kathyayini | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 25. | N. Poojitha Chowdary | 10 | 10 | 7 | 10 | 10 | 10 | 9.5 |
| 26. | G. Malasree | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 27. | P.V.Bhagya Nikhila | 10 | 9 | 9 | 10 | 10 | 9 | 9.5 |
| 28. | Shaik Rubeena | 9 | 10 | 9 | 10 | 10 | 9 | 9.5 |
| 29. | V. Mukund | 9 | 9 | 9 | 10 | 10 | 10 | 9.5 |
| 30. | Md. Shazia | 9 | 10 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 31. | K. Asritha | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 32. | G. Praneetha Bharadwaja | 9 | 10 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 33. | P. Bhanuja | 9 | 8 | 10 | 10 | 10 | 10 | 9.5 |
| 34. | B.Sritha | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 35. | D.Nikhila | 10 | 10 | 8 | 10 | 10 | 9 | 9.5 |
| 36. | P.Sireesha | 10 | 10 | 8 | 10 | 10 | 9 | 9.5 |
| 37. | K. Prathayush | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 38. | T. Rahul | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 39. | S.S.V.L Harika | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 40. | K. Rishitha Krishna | 9 | 9 | 9 | 10 | 10 | 10 | 9.5 |
| 41. | B. Aishwarya | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 42. | P. Dhaarini | 9 | 9 | 9 | 10 | 10 | 10 | 9.5 |
| 43. | K.Sai Lasya | 9 | 9 | 9 | 10 | 10 | 10 | 9.5 |
| 44. | D. Vishnu Vardhan | 10 | 10 | 8 | 10 | 9 | 9 | 9.3 |
| 45. | A. Niharika | 9 | 10 | 8 | 10 | 10 | 9 | 9.3 |
| 46. | R.Vinay | 9 | 10 | 8 | 10 | 10 | 9 | 9.3 |
| 47. | Syed Tafheem | 9 | 9 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 48. | T. Maruthiram Preetham | 10 | 9 | 8 | 10 | 9 | 10 | 9.3 |
| 49. | V. Sudheer Reddy | 10 | 8 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 50. | J. Nikitha | 10 | 9 | 8 | 10 | 9 | 10 | 9.3 |
| 51. | P. Muni Vignitha | 10 | 8 | 9 | 10 | 9 | 10 | 9.3 |
| 52. | P.Vishunu Vardhan | 9 | 9 | 9 | 10 | 9 | 10 | 9.3 |
| 53. | P. Sravan Kumar | 9 | 9 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 54. | G. Dharani Pavan Kumar | 9 | 9 | 9 | 10 | 10 | 9 | 9.3 |
| 55. | K. Rajesh | 10 | 9 | 8 | 10 | 10 | 9 | 9.3 |
| 56. | Sk. Waajaeed | 9 | 8 | 9 | 10 | 10 | 10 | 9.3 |
| 57. | K. Sreecharan | 9 | 9 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 58. | T. Sruthi | 10 | 9 | 7 | 10 | 10 | 10 | 9.3 |
| 59. | R. Sindhoora | 10 | 9 | 8 | 10 | 10 | 9 | 9.3 |
| 60. | R. Harshini | 9 | 9 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 61. | B. Harshitha | 8 | 9 | 9 | 10 | 9 | 10 | 9.2 |
| 62. | P. Meghana | 10 | 9 | 8 | 10 | 9 | 9 | 9.2 |
| 63. | D. Urmila Priyanka | 9 | 9 | 7 | 10 | 10 | 10 | 9.2 |
| 64. | M. Lakshmi Sindhu | 10 | 9 | 8 | 10 | 10 | 8 | 9.2 |
| 65. | A. Sai Sathwik | 9 | 9 | 9 | 9 | 10 | 9 | 9.2 |
| 66. | G. Devisree | 9 | 9 | 7 | 10 | 10 | 10 | 9.2 |
| 67. | E. Venkata Sruthi | 10 | 9 | 8 | 10 | 9 | 9 | 9.2 |
| 68. | B. Meghana | 9 | 9 | 7 | 10 | 10 | 10 | 9.2 |
| 69. | N.V. Siva Sai Prathap | 9 | 9 | 7 | 10 | 10 | 10 | 9.2 |
| 70. | M. Deepika | 9 | 8 | 8 | 10 | 10 | 10 | 9.2 |
| 71. | P. Saipragnavi | 8 | 9 | 8 | 10 | 10 | 10 | 9.2 |
| 72. | Maramreddypalli Venkatesh | 9 | 9 | 7 | 10 | 10 | 10 | 9.2 |
| 73. | G. Saimanoj Kumar | 9 | 8 | 8 | 10 | 10 | 10 | 9.2 |
| 74. | N. Charitha | 9 | 9 | 7 | 10 | 10 | 10 | 9.2 |
| 75. | M. Sailalitha | 9 | 9 | 7 | 10 | 10 | 10 | 9.2 |
| 76. | K. Manasa | 9 | 9 | 8 | 9 | 9 | 10 | 9.0 |
| 77. | G.Vishnu Vardhan Reddy | 9 | 9 | 7 | 10 | 9 | 10 | 9.0 |
| 78. | G. Yashwanth | 9 | 9 | 7 | 10 | 9 | 10 | 9.0 |
| 79. | K. Vardhitha | 9 | 9 | 8 | 10 | 9 | 9 | 9.0 |
| 80. | M. Penchala Revanth | 9 | 9 | 7 | 10 | 9 | 10 | 9.0 |
| 81. | C. Sai Thapaswini | 9 | 9 | 7 | 10 | 9 | 10 | 9.0 |
| 82. | B.Sujan | 9 | 9 | 8 | 10 | 9 | 9 | 9.0 |
| 83. | B. Srinivasa Ramji Hind | 9 | 8 | 8 | 10 | 9 | 10 | 9.0 |
| 84. | R. Sai Pujitha | 10 | 9 | 7 | 10 | 9 | 9 | 9.0 |
| 85. | P. Keerthi | 9 | 9 | 9 | 10 | 9 | 8 | 9.0 |
| 86. | P. Lakshmi Sarvani | 9 | 9 | 7 | 10 | 10 | 9 | 9.0 |
| 87. | I. Harsha Vardhan | 9 | 9 | 8 | 10 | 9 | 9 | 9.0 |
| 88. | W. Venkata Vivek | 9 | 9 | 6 | 10 | 10 | 10 | 9.0 |
| 89. | K. Pranay Reddy | 9 | 9 | 8 | 10 | 8 | 9 | 8.8 |
| 90. | R. Pallavi | 9 | 9 | 6 | 10 | 9 | 10 | 8.8 |
| 91. | M. Abhinay | 8 | 9 | 8 | 10 | 9 | 9 | 8.8 |
| 92. | Y. Lakshmi Harika | 9 | 9 | 6 | 10 | 9 | 10 | 8.8 |
| 93. | N. Navya | 9 | 8 | 8 | 10 | 9 | 9 | 8.8 |
| 94. | M. Vaishnavi | 9 | 8 | 8 | 10 | 9 | 9 | 8.8 |
| 95. | P.V. Durga Sai Kumar | 9 | 9 | 6 | 10 | 9 | 10 | 8.8 |
| 96. | P. Nikhil | 9 | 9 | 7 | 10 | 9 | 9 | 8.8 |
| 97. | P. Bhanu Lakshmi Ananya | 9 | 8 | 8 | 10 | 9 | 9 | 8.8 |
| 98. | N. Venkata Shashanka | 8 | 8 | 9 | 9 | 10 | 9 | 8.8 |
| 99. | N. Kiran Sai Singh | 8 | 9 | 7 | 10 | 10 | 9 | 8.8 |
| 100. | T. Greeshma Royal | 9 | 9 | 8 | 10 | 8 | 9 | 8.8 |
| 101. | A.V.L.N Sai Swarup | 9 | 8 | 8 | 10 | 9 | 9 | 8.8 |
| 102. | M. Jessi Praneeth | 9 | 9 | 7 | 10 | 9 | 9 | 8.8 |
| 103. | B. Bhavithya Kumar | 9 | 8 | 7 | 10 | 10 | 9 | 8.8 |
| 104. | G. Sumeghana | 9 | 8 | 7 | 10 | 9 | 10 | 8.8 |
| 105. | Y. Ranganath Adithya | 8 | 8 | 8 | 10 | 9 | 9 | 8.7 |
| 106. | M.S.S. Mounish Reddy | 8 | 8 | 7 | 10 | 10 | 9 | 8.7 |
| 107. | G. Akhil Reddy | 9 | 9 | 7 | 10 | 7 | 10 | 8.7 |
| 108. | R. Abhinav Reddy | 9 | 8 | 8 | 10 | 9 | 8 | 8.7 |
| 109. | N. Vani Shankari | 10 | 8 | 7 | 10 | 8 | 9 | 8.7 |
| 110. | K. Niteesh Bharadwaj | 9 | 8 | 7 | 10 | 9 | 9 | 8.7 |
| 111. | Y. Venkata Krishna | 6 | 8 | 8 | 10 | 10 | 10 | 8.7 |
| 112. | N. Ravi Kiran | 9 | 8 | 8 | 9 | 10 | 8 | 8.7 |
| 113. | G. Lohitha Chowdary | 9 | 9 | 7 | 10 | 9 | 8 | 8.7 |
| 114. | T. Tejesh | 7 | 8 | 9 | 10 | 10 | 8 | 8.7 |
| 115. | Sk. Shoyab | 9 | 9 | 8 | 7 | 9 | 9 | 8.5 |
| 116. | D. Sai Srinivas | 7 | 8 | 9 | 9 | 9 | 9 | 8.5 |
| 117. | M. Hyndhavi | 8 | 7 | 8 | 10 | 9 | 9 | 8.5 |
| 118. | N.Dinesh Kumar Reddy | 9 | 8 | 7 | 10 | 9 | 8 | 8.5 |
| 119. | P.V. Vardhan Reddy | 9 | 7 | 7 | 10 | 9 | 9 | 8.5 |
| 120. | K. Chaitanya Reddy | 9 | 7 | 8 | 10 | 8 | 9 | 8.5 |
| 121. | M. Vidyadhari | 9 | 8 | 8 | 9 | 8 | 9 | 8.5 |
| 122. | A. Priyanka | 8 | 9 | 8 | 9 | 8 | 9 | 8.5 |
| 123. | N. Naga Spoorthi | 9 | 8 | 7 | 9 | 8 | 9 | 8.3 |
| 124. | M. Harika | 9 | 8 | 8 | 9 | 8 | 8 | 8.3 |
| 125. | Ch. Hrishikesh | 8 | 7 | 8 | 9 | 9 | 9 | 8.3 |
| 126. | A. Venkata Anand Reddy | 7 | 6 | 8 | 10 | 9 | 10 | 8.3 |
| 127. | Ch. Kalyan Raj | 9 | 8 | 6 | 10 | 9 | 8 | 8.3 |
| 128. | B. Sai Preetham Reddy | 8 | 7 | 9 | 9 | 8 | 8 | 8.2 |
| 129. | D. Kavya Reddy | 8 | 7 | 7 | 10 | 9 | 8 | 8.2 |
| 130. | D. Saisree Manogna | 9 | 9 | 8 | 9 | 7 | 7 | 8.2 |
| 131. | Ch. Sunny Priyatham | 9 | 8 | 6 | 10 | 7 | 9 | 8.2 |
| 132. | M. Bhavana Deepthi | 9 | 8 | 9 | 8 | 7 | 8 | 8.2 |
| 133. | K. Sumalya | 8 | 7 | 6 | 10 | 9 | 9 | 8.2 |
| 134. | B. Sreehari | 9 | 6 | 7 | 9 | 10 | 8 | 8.2 |
| 135. | G. Sravanthi | 8 | 8 | 8 | 9 | 8 | 8 | 8.2 |
| 136. | D. Venkata Uma Srikari | 9 | 9 | 7 | 10 | 6 | 8 | 8.2 |
| 137. | K. Angel | 9 | 8 | 8 | 7 | 9 | 8 | 8.2 |
| 138. | M. Jahnavi | 8 | 7 | 8 | 9 | 8 | 8 | 8.0 |
| 139. | Sk. Rahiman | 8 | 8 | 8 | 9 | 7 | 8 | 8.0 |
| 140. | K. Snehitha | 8 | 6 | 6 | 10 | 8 | 9 | 7.8 |
| 141. | J. Ravi Chandra | 8 | 6 | 6 | 9 | 9 | 9 | 7.8 |
| 142. | A. Vineeth | 8 | 6 | 8 | 9 | 8 | 8 | 7.8 |
| 143. | U. Divya Priya | 9 | 6 | 6 | 9 | 9 | 8 | 7.8 |
| 144. | P. Sri Vamsi Krishna | 8 | 4 | 8 | 10 | 9 | 8 | 7.8 |
| 145. | A. Kavya Priya | 10 | 9 | 7 | 6 | 7 | 7 | 7.7 |
| 146. | D. Ranvitha | 9 | 7 | 8 | 10 | 5 | 7 | 7.7 |
| 147. | B.Harsha Vardhan | 6 | 6 | 5 | 10 | 10 | 9 | 7.7 |
| 148. | M. Sriharshini | 6 | 7 | 6 | 9 | 8 | 9 | 7.5 |
| 149. | Ch. Srinivasa Hemanth | 6 | 6 | 8 | 9 | 8 | 8 | 7.5 |
| 150. | R. Sai Srikanth | 7 | 5 | 8 | 8 | 9 | 8 | 7.5 |
| 151. | V. Gopi Siva Sai | 8 | 7 | 7 | 8 | 7 | 8 | 7.5 |
| 152. | P. Saidharhas Reddy | 8 | 7 | 6 | 10 | 8 | 6 | 7.5 |
| 153. | Md. Umaid Salam | 8 | 6 | 8 | 6 | 8 | 9 | 7.5 |
| 154. | Ch. Venkata Sai Harshith | 9 | 6 | 7 | 8 | 7 | 8 | 7.5 |
| 155. | N. Bharath | 7 | 5 | 6 | 9 | 8 | 9 | 7.3 |
| 156. | N. Sai Bhargav | 7 | 7 | 6 | 10 | 6 | 8 | 7.3 |
| 157. | D. Venkatesh | 6 | 7 | 7 | 8 | 8 | 8 | 7.3 |
| 158. | K. Gokul Krishna Sai | 6 | 8 | 6 | 9 | 7 | 7 | 7.2 |
| 159. | K. Premsai | 8 | 7 | 7 | 9 | 7 | 5 | 7.2 |
| 160. | P. Aruna Sai Kumar | 9 | 8 | 7 | 7 | 4 | 8 | 7.2 |
| 161. | S. Venkata Sai Gokul | 7 | 5 | 8 | 8 | 8 | 7 | 7.2 |

**L.K.G. నుండి 8వ తరగతి వరకు అడ్మిషన్లు జరుగుచున్నవి**

**School Timings : 9-20 A.M to 4-30 P.M**

**Smt. M.Beulah Grace,** B.Sc., B.Ed
Head Mistress

**School Reopens on 6th June**

**P. Krishna Murthy** M.Com.,
Correspondent

# పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో విరబూసిన నెల్లూరు కుసుమాలు!

ఎప్పటిలానే పదవతరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు విద్యార్థినీ విద్యార్థులు అద్భుత ఫలితాలు సాధించారు. నగరంలో స్కూళ్లు సాధించిన ఫలితాలను పాఠకులకోసం వివరంగా ఇస్తున్నాం. చదవండి.

## రవీంద్ర భారతి హైస్కూల్ విద్యార్థుల రికార్డు!

నెల్లూరు ఫత్తేఖాన్‌పేటలోని రవీంద్రభారతి స్కూల్ విద్యార్థినీ, విద్యార్థులు పదవతరగతి పరీక్షా ఫలితాల్లో రికార్డులు నెలకొల్పారు. జిపిఏ (గ్రేడ్ పాయింట్ యావరేజ్) 10కి 10 పాయింట్లను 11 మంది సాధించారు. 9.8కిపైగా పాయింట్లను 186 మంది, 9.7పైగా పాయింట్లను 432మంది, 9.2కి పైగా పాయింట్లను 1478 మంది సాధించారు. అద్భుత విజయాలను సాధించిన విద్యార్థినీ విద్యార్థులను రవీంద్రభారతి విద్యాసంస్థల ఛైర్మన్ ఎం.ఎస్.మణి అభినందించారు.

## ఎస్ఆర్‌కె... ఎస్ఆర్‌కేనే!

పదవతరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు మాగుంట లేఅవుట్‌లోని డాక్టర్ ఎస్ఆర్‌కె ఇంగ్లీషు మీడియం స్కూల్ విద్యార్థినీ, విద్యార్థులు కళ్లు చెదిరే ఫలితాలు సాధించారు. ఇక్కడ చదివిన ఎస్.హర్షిత జి.పి.ఏ 10కి 10 సాధించి రాష్ట్రస్థాయి ర్యాంకర్లలో ఒకరుగా నిలిచింది. ఈ సందర్భంగా స్కూల్ కరస్పాండెంట్ పి.కృష్ణమూర్తి మాట్లాడుతూ తమ హైస్కూల్‌లో చదివిన విద్యార్థుల్లో 9.8 పాయింట్లను 8మంది, 9.7 పాయింట్లను 15మంది, 9.5 పాయింట్లను 19మంది, 9.3 పాయింట్లను 17 మంది, 9.2 పాయింట్లను 15 మంది, 9 పాయింట్లను 13 మంది సాధించారన్నారు. తొమ్మిది పాయింట్లకుపైగా 88 మంది, ఎనిమిది పాయింట్లు, 139మంది, ఏడు పాయింట్లు 168 మంది విద్యార్థినీ, విద్యార్థులు సాధించినట్లు వివరించారు.

## సత్తాచూపిన నేతాజీ పైలెట్ హైస్కూల్

పదవతరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు విజయమహల్ గేటు వద్ద నేతాజీ పైలెట్ హైస్కూల్ విద్యార్థినీ, విద్యార్థులు అద్భుత ఫలితాలు సాధించారు. ఇక్కడ చదివిన విద్యార్థిని షేక్. అర్షియా యాస్మిన్ పదిపాయింట్లకు పది పాయింట్లు సాధించి రాష్ట్ర ప్రథమ ర్యాంకర్లలో ఒకరుగా నిలిచింది. ఇక్కడే చదివిన కె.మాధురి 9.8 పాయింట్లు, బి.హేమలత 9.7 పాయింట్లు, ఐ.దీక్షాంత 9.7 పాయింట్లు, కె.భవ్య 9.7 పాయింట్లు, కె.శ్రీమౌనిక 9.7 పాయింట్లు, కె.ఎస్.ఎస్ అభిషేక్ 9.7 పాయింట్లు సాధించారు. స్టేట్ రికార్డుతోపాటు మంచి ఫలితాలు సాధింప చేసిన ఉపాధ్యాయ బృందాన్ని హైస్కూల్ కరస్పాండెంట్ నేతాజీ సుబ్బారెడ్డి, డైరక్టర్ కె.నరేంద్రరెడ్డి, హెడ్ మిస్ట్రెస్ ఎన్.ప్రసన్న, అన్నీ గ్రేస్‌లు అభినందించారు.

## ఓవెల్ స్కూల్ ఘనత!

పదవతరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు మినీ బైపాసురోడ్డులోని ఓవెల్ స్కూల్ విద్యార్థులు మంచి ప్రతిభ చూపించారు. స్కూల్‌లో చదివిన విద్యార్థి సంజయ్‌భార్గవ్ 10కి 10పాయింట్లు, అరవింద్‌సాగర్ 9.8పాయింట్లు, పావని, ప్రణీతలు 9.7 పాయింట్లు సాధించారు. స్కూల్ నుంచి పరీక్షకు హాజరైన 43 మంది విద్యార్థులు ఉత్తీర్ణత సాధించారని స్కూల్ ప్రిన్సిపాల్ వేణు చెప్పారు.

## రత్నం విద్యాసంస్థల్లో రత్నాలు!

నెల్లూరు రత్నం విద్యాసంస్థల్లో పదవతరగతి చదివిన విద్యార్థులు తాము రత్నాలని ఫలితాల్లో మరోసారి చాటిచెప్పారు. డి.శ్రీకాంత్, ఎస్.సాయి లలిత, ఎన్వీఎస్ శ్రీహర్ష పదికి పది పాయింట్లు సాధించి రాష్ట్రస్థాయిలో ర్యాంకర్లుగా నిలిచారు. 9.8 పాయింట్లను 55మంది విద్యార్థులు, 9.7 పాయింట్లను 94 మంది, 9.5 పాయింట్లను 100 మంది, 9.3 పాయింట్లను 106మంది, 9.2 పాయింట్లను 100మంది, 9 పాయింట్లను 97మంది సాధించారు. మంచి ఫలితాలను సాధించిన విద్యార్థినీ విద్యార్థులను రత్నం విద్యాసంస్థల ఛైర్మన్ కె.వి.రత్నం, డైరక్టర్ కె.వేణుగోపాల్, అకడమిక్ డైరక్టర్ డాక్టర్ కె.కృష్ణకిషోర్ అభినందించారు.

## శాంతినికేతన్‌లో మంచి ఫలితాలు!

నెల్లూరు కొండాయపాళెం గేటు సెంటర్‌లోని శాంతినికేతన్ హైస్కూల్‌లో పదవతరగతి చదివే విద్యార్థులు మెరుగైన ఫలితాలు సాధించారు. పది మంది విద్యార్థులు ఎప్పటిలానే 10కి 10పాయింట్లు సాధించడం విశేషం. వి.శైణి 9.8 పాయింట్లు, ఎస్.హర్షిత 9.8 పాయింట్లు, జి.విహాంక 9.8 పాయింట్లు సాధించారు. ఇక్కడే చదివిన విద్యార్థుల్లో 8నుంచి 9 పాయింట్లు 16 మంది, ఏడు నుంచి 8 పాయింట్లు 18మంది సాధించారు. క్రియేటివ్ కోచింగ్, క్వాలిటీ ఎడ్యుకేషన్ వల్లే ఈ విజయం సాధ్యమయ్యిందని స్కూల్ కరస్పాండెంట్ ఎం.మోసస్ చెప్పారు.

## ఎల్.ఎల్.ఎఫ్ విజయకేతనం!

పదవతరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు వేదాయపాళెంలోని లిల్లీ లిటిల్ ఫ్లవర్ స్కూల్ విద్యార్థినీ, విద్యార్థులు విజయకేతనం ఎగురవేశారు. ఈ స్కూల్‌లో చదివిన ఎం.సాయిలిఖిత 9.8, పి.అనూజ 9.8, టి.గిరిధరసాయి, వి.జాహ్నవి సాయి, డిజి ప్రవల్లిక 9.7 పాయింట్లు సాధించారు. 26మంది విద్యార్థినీ విద్యార్థులు తొమ్మిది పాయింట్లకుపై గ్రేడ్లను సాధించారు. ఈ సందర్భంగా స్కూల్ కరస్పాండెంట్ ఈ.కృష్ణచైతన్య మాట్లాడుతూ ప్రతి సంవత్సరం తమ స్కూల్ విద్యార్థినీ విద్యార్థులు వంద శాతం ఫలితాలను సాధిస్తుండడం ఆనందకరమన్నారు.

## మైథిలిస్కూల్‌లో అద్భుత ఫలితాలు

పదవతరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు చంద్రమౌళినగర్‌లోని మైథిలిస్కూల్ విద్యార్థులు 33 మందికిగాను 33 మంది ఉత్తీర్ణులై నూరుశాతం ఫలితాలను నమోదు చేశారు. స్కూల్‌లో చదివిన విద్యార్థి కె.జీవిత 9.8 పాయింట్లతో మొదటి ర్యాంకును, టి.గ్రీష్మ 9.7 పాయింట్లతో రెండవర్యాంకును సాధించింది. 9.5 పాయింట్లను ఐదుమంది విద్యార్థులు సాధించారు. ఈ సందర్భంగా స్కూల్ కరస్పాండెంట్ మైథిలీ మనోహర్‌రెడ్డి మాట్లాడుతూ ప్రతి సంవత్సరం నూరుశాతం ఫలితాలను తమ స్కూల్ విద్యార్థులు సాధిస్తున్నారని, ఈ విజయం వెనుక ఉపాధ్యాయునీ, ఉపాధ్యాయులు, తల్లిదండ్రుల తోడ్పాటు ఎంతో ఉందన్నారు.

## విబిఆర్ విద్యార్థుల ప్రతిభ

నెల్లూరు గ్రామీణ మండలం ధనలక్ష్మీపురంలోని విబిఆర్ రెసిడెన్షియల్ పాఠశాలలో పదవ తరగతి చదివిన విద్యార్థులు మంచి ఫలితాలు సాధించారు. ఇక్కడ చదివిన విద్యార్థి ఎన్.లోకేష్ పదికి పది పాయింట్లు సాధించాడు. పాఠశాల నుంచి మొత్తం 150 మంది విద్యార్థులు పరీక్ష వ్రాయగా 150 మంది పాసయ్యారని, తొమ్మిది పాయింట్లను 60మంది విద్యార్థులు సాధించారని పాఠశాల ఛైర్మన్ ఊటుకూరు బ్రహ్మారెడ్డి చెప్పారు.

కొరవ 9వ పేజీలో

# విరబూసిన నెల్లూరు కుసుమాలు!

8వ పేజీ కొరవ

## ఆదిశంకర టెక్నోస్కూల్స్ హవా!

పదవతరగతి ఫలితాల్లో నెల్లూరులోని ఆది శంకర టెక్నోస్కూల్ విద్యార్థులు మెరుగైన ఫలితాలు సాధించారు. 9.8 పాయింట్లు ఏడుమంది, తొమ్మిది కంటే ఎక్కువ పాయింట్లు 72మంది విద్యార్థులు సాధించారని విద్యాసంస్థల ప్రతినిధి వి.ఎల్.ఎస్ ప్రసాద్ తెలిపారు. ఉపాధ్యాయుల్లో అంకిత భావం, విద్యార్థుల కృషితో ఈ ఫలితాలు సాధ్యమయ్యాయన్నారు. అకాడమి డైరక్టర్ స్వామిదాస్, పరిపాలనాధికారి రామయ్య, ప్రిన్సిపాల్ ఉపాధ్యాయులు, విద్యార్థులను అభినందించారు.




## వికాస్ విజయ కేతనం!

పదవతరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు బాలాజీనగర్‌లోని వికాస్ హైస్కూల్ విద్యార్థులు విజయకేతనం ఎగురవేశారు. ఇక్కడ చదివిన షేక్‌అయేషా 9.8 పాయింట్లతో స్కూల్ ప్రథమురాలిగా నిలిచింది. కోలా హరిచందన 9.7పాయింట్లు సాధించింది. తొమ్మిది పాయింట్లను 8మంది విద్యార్థులు సాధించారని వికాస్ హైస్కూల్ డైరక్టర్ కర్తం ప్రతాప్‌రెడ్డి చెప్పారు. ఉత్తమ ఫలితాల సాధనకు కారకుడైన ఉపాధ్యాయులు, విద్యార్థులను స్కూల్ కరస్పాండెంట్ కర్తం జ్యోతి అభినందించారు.

## లిటిల్ ఏంజల్స్ హవా!

పదవతరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు మూలాపేటలోని లిటిల్ ఏంజల్స్ హైస్కూల్ విద్యార్థులు నూటికి నూరు శాతం ఫలితాలు సాధించినట్లు స్కూల్ కరస్పాం

కొరవ 14వ పేజీలో






# వారఫలాలు

*తేది 25-5-2013 నుండి 31-5-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో రవి, కుజ, గురు, వృషభంలో శుక్రుడు 30తేది వరకు తదుపరి మిథునంలో, వృషభంలో బుధుడు 27తేది వరకు తదుపరి మిథునంలో; తులలో శని, రాహువులు;వృశ్చిక, ధనుస్సు, మకర, కుంభాలలో చంద్రుడు సంచరిస్తారు.*

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1 పా)

ఉద్యోగులకు మిత్రుల వల్ల అనుకూల ప్రదేశాలకు బదలీలు, మిత్ర లాభం. వృత్తి, వ్యాపారాలలో ధనాదాయం రావచ్చు. వ్యవహార జయం పొందుట. కొన్ని రుణాల నుండి విముక్తి. విద్యార్థులకు భవిష్యత్తు విషయాలలో చికాకులు తప్పవు. వ్యవసాయదారులకు అనుకూలతలున్నా పనివారితో ఇబ్బందులు తప్పవు. కళా, క్రీడా రంగాల వారికి ధనాదాయం వుంటుంది.

**వృషభం** (కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా)

కుటుంబ, సంసార ఇబ్బందులుంటాయి. వృత్తి, వ్యాపారాలలో ఆదాయ వ్యయాలలో నిక్కచ్చిత పాటించాలి. వ్యవసాయదారులకు ధనాదాయం వుంటుంది. విద్యార్థుల ఇది పరీక్షాకాలం. ఉద్యోగులకు ఆత్మవిశ్వాసమౌతుంది. నిందలు పడే అవకాశాలున్నాయి. వృత్తి, వ్యాపారాలలో క్రిందిస్థాయి పనివారితో ఇబ్బందులొస్తాయి. కళా, క్రీడా రంగాల వారికి చిన్నవైరాలు ఏర్పడుతాయి.

**మిథునం** (మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు1,2,3 పా)

వృత్తి, వ్యాపారాలలోని భాగస్తులతో విభేదాలు. చేసే పనులలో నిరంతర ప్రయత్నాలతో ఫలింపు. కుటుంబ వ్యక్తులతో దూర ప్రయాణాలు, శరీరారోగ్యంపై శ్రద్ధ అవసరం. ధార్మిక విషయాలలో తరచూ పాల్గొంటారు. అన్ని వర్గాల వారికీ ఆర్థికాదాయాల లోటుండదు. స్థిరాస్తి విషయాలలో దాయాదులతో సమస్యలు. విద్యార్థులు అనుకున్నది సాధిస్తారు. వ్యవసాయదారులకు శ్రమానంతర లాభాలు.

**కర్కాటకం** (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

తలపెట్టిన పనులు బంధుమిత్రుల సహకారంతో సాధిస్తారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగ, వ్యవసాయ రంగాలలోని వారు శ్రమకు తగ్గ ఆదాయం పొందగలరు. తరచుగా వచ్చే ఆందోళనలు తగ్గించుకొనడం మంచిది. ఇతరత్రా వ్యాపారాలలో ఆర్థిక పెట్టుబడులపై జాగ్రత్త వహించాలి. విద్యార్థులు కొంచెం ఆలస్యమైనా తలచింది సాధిస్తారు. ఆందోళన అనవసరం.

**సింహం** (మఖ, పుబ్బ ఉత్తర 1 పా)

స్త్రీల వల్ల సమస్యలు లేదా కలహాలు రావచ్చు. దుష్టులకు దూరంగా వుండాలి. తప్పుడు మార్గాల అన్వేషణ జరగగలదు. అతిగా ప్రయాణాలు చేస్తారు. స్థిరాస్తుల విషయమై ఆలోచన చేస్తారు. అవసరానికి డబ్బు చేతికందుతుంది. అకారణ ధన వ్యయం. విద్యార్థులకు ఇది పరీక్షా కాలం. వ్యవసాయదారులకు ఆర్థికాదాయాలు. కళా, క్రీడా రంగాల వారికి ఆటంకాలెదురౌతాయి.

**కన్య** (ఉత్తర 2,3,4పా. హస్త, చిత్తా 1, 2 పా)

వృత్తి, వ్యాపారాలలో క్రమంగా ఆర్థికాదాయాలు పెరుగుతాయి. చేపట్టిన పనులు పూర్తి చేస్తారు. స్త్రీలతో అకారణ వైరాల వల్ల చిక్కులు, చికాకులు. అన్నివర్గాల వారి ఆర్థిక విషయాలలో గోప్యత అవసరం. విద్యార్థులు అనుకూలతలు సాధిస్తారు. వ్యవసాయ, కళా, క్రీడా రంగాల వారికి వృత్తి వ్యతిరేకతలు కొంత వుంటాయి. వృత్తి, వ్యాపారాలలో జాయింట్ సమస్యలున్నా విజయాన్ని సాధిస్తారు.

**తుల** (చిత్త 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా)

తలపెట్టిన పనులు ఇతోధికంగా పూర్తి చేయగలరు. కొంత రుణ సమస్య తీరగలదు. ముఖ్య వ్యవహారాలలో సన్నిహితులతో నిక్కచ్చిగా వ్యవహరించడం మంచిది. ఆర్థిక ఇబ్బందులు తొలగుతాయి. వృత్తి, వ్యాపారాలలో శ్రమకు తగ్గ ఆదాయం. పుణ్యస్థల సందర్శన. విద్యార్థుల భవిష్యత్తుకు కొన్ని విషయాలలో శ్రమకు తగ్గ ఫలితాలుంటాయి. వ్యవసాయం ఆశాజనకం.

**వృశ్చికం** (విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ఠ)

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో ఆర్థిక వ్యవహారాలు సమానంగా వుంటాయి. ధార్మిక చింతన పెరుగుతుంది. శరీరారోగ్య విషయంలో పలు జాగ్రత్తలు అవసరం. కోర్టు వ్యవహారాలు చీకాకు కలిగిస్తాయి. విద్యార్థులకు బంధువర్గాలచే లబ్ది. నూతన అవకాశాలు చేజార్చుకోవద్దు. వ్యవసాయ, కళా, క్రీడాకారులకు విజయాలు చేకూరుతాయి. రాజకీయులకు పై వర్గాలతో కొంత విభేదాలొస్తాయి.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

స్థిరాస్తుల మూలంగా ధనాదాయం. విద్యార్థులు ఉన్నత విద్యలలో ఫలితాలు సాధిస్తారు. ఉద్యోగులకు అనుకూలమైన ప్రాంతాలకు బదిలీలుంటాయి. ప్రమోషన్లు అనుకూలిస్తాయి. వృత్తి, వ్యాపారాలు క్రమంగా మెరుగుపడతాయి. వ్యవసాయ, కళా, క్రీడాకారులకు ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. అన్ని రంగాలలో పురోగతి సాధిస్తారు. కొన్ని వృత్తుల వారికి భయాందోళనలు కలుగుతాయి.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

తలపెట్టిన పనులలో ఆటంకాలున్నా విజయం సాధిస్తారు. విద్యార్థులకు పరీక్షా కాలం. ఇంట్లో శుభకార్యాలకు బంధుమిత్రుల కలయిక. వృత్తి, వ్యాపారాలలో ధనాదాయం వుంటుంది. వ్యవసాయ, కళా, క్రీడాకారులు తలచిన పనులు నెరవేరుతాయి. అనుకున్నవి సాధిస్తారు. రాజకీయులు తమ వర్గీయులతో కోపం ప్రదర్శిస్తారు. ఆర్థిక నష్టాలుంటాయి. అల్పబుద్ధితో ప్రయాణాలు చేస్తారు.

**కుంభం** (ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా)

చేస్తున్న పనులు వాయిదాపడుట, అనుకూలతలు లేకుండడం జరుగుతుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు ఆర్థికాదాయాలు బాగున్నా పనులందు ఆటంకాలుంటాయి. నూతన వ్యాపారాలకై చేసే ఆలోచనలు ఫలిస్తాయి. విద్యార్థులకు తరచూ ఆటంకాలు, భయాందోళనలుంటాయి. వ్యవసాయం పర్వాలేదనిపిస్తుంది. రాజకీయ నాయకులకు కొందరి నూతన పరిచయాలు ఆందోళన కలిగిస్తాయి.

**మీనం** (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

తలపెట్టిన పనులలో విజయాలు సాధిస్తారు. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికాదాయం బాగుంటుంది. నూతన పెట్టుబడిపై మార్గాలు అన్వేషిస్తారు. విద్యార్థులకు ఆశాజనకం. పైవిద్యలపై శ్రద్ధ అవసరం. బాధ్యతలు పెరుగుతాయి. వ్యవసాయ, కళా, క్రీడాకారులకు అనుకూలం. రాజకీయులకు పై వర్గాల నుండి ముఖ్యమైన ఆదాయాలుంటాయి. కుటుంబంలో కొన్ని సమస్యలకు పరిష్కారం లభిస్తుంది.

## పంచాంగం

25తేది అన్నమాచార్య జయంతి. హజరత్ ఆలీ జన్మదినం. మహావైశాఖ, బుద్ధ పూర్ణిమ, కూర్మ జయంతి. రోహిణి కార్తె ప్రారంభం. జవహర్‌లాల్ నెహ్రూ వర్ధంతి.

28తేది కర్తరీ త్యాగం.

31తేది సరస్వతీ నదీ పుష్కరాలు ప్రారంభం.

### శుభ ముహూర్తాలు

26, 29, 30, 31తేదిలలో సీమంత, అన్నప్రాసన, అక్షరాభ్యాస, ఊయల, గర్భదాన, వ్యాపార, వ్యవసాయ పనులకు, పెండ్లిచూపులకు శుభ ముహూర్తాలున్నాయి.

### మే తిథులు

**వైశాఖ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 25 | శని | పౌర్ణమి | ప | 09.53 గం.ల.వ |

**వైశాఖ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 26 | ఆది | పాడ్యమి | ఉ | 06.14 గం.ల.వ |
| 27 | సోమ | తదియ | రా | 11.01 గం.ల.వ |
| 28 | మంగళ | చవితి | సా | 07.46 గం.ల.వ |
| 29 | బుధ | పంచమి | సా | 04.56 గం.ల.వ |
| 30 | గురు | షష్ఠి | ప | 02.38 గం.ల.వ |
| 31 | శుక్ర | సప్తమి | ప | 01.01 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

# 'వృక్షం' దేవతా సమానం, మానవ మనుగడకు మూలం!

*ఎం.భార్గవి — బెంగుళూరు*

*★ వృక్షాలపై దేవతలు నివాసం వుంటారని వేదాలు చెబుతున్నాయి. ఎంతవరకు నిజం?*

బృహస్పతి తన వాస్తు సంహితలో వృక్షాలు దేవతల అవాసమనీ, వృక్షాలున్న గృహస్థు ఆశీర్వాదాలు పొందుతాడని, మానవ మనుగడకు వృక్షాలు, జీవరాశుల మధ్య బ్రహ్మ బంధం పెట్టాడని పేర్కొన్నారు.

*కెటిఆర్ — చిత్తూరు*

*★ 'వృక్షానాం' శ్లోకం చదివాక మీరు చెబుతున్న వృక్షవేధ నిజమేననిపించింది.*

విశ్వామిత్ర వాస్తు మూడవ అధ్యాయంలోని పన్నెండవ శ్లోకం అది. వృక్షాల్ని అకారణంగా నరికేసిన వారనుభవించిన నరక సదృశ ఘటనల్ని అందులో వివరించారు.

*డి.శిరీషారెడ్డి — సికింద్రాబాద్*

*★ వాస్తుకు, జ్యోతిష్యానికీ గల ప్రభావాలు చెప్పండి?*

వాస్తు దోషాలు కుటుంబం మొత్తంమీద ప్రభావం చూపితే జ్యోతిషం వ్యక్తిగత ప్రభావాల్ని చూపిస్తుంది.

*డాక్టర్ ప్రదీప్‌పాండే — చెన్నై*

*★ సూర్య గ్రహానికి మిత్ర, శత్రువులెవరు? సంతానం ఎవరు?*

సూర్యుడికి మిత్రులు కుజ, గురు, చంద్రులు, శని, శుక్రుడు శత్రు గ్రహాలు. సింహరాశికి అధిపతి సూర్యుడు. యముడు కుమారుడు. సూర్యుడు అదితి, కశ్యపుల సంతానం.

*పి.శ్రీధర్ — చిత్తూర*

*★ వరుస సమస్యలతో సతమతమవుతున్నాము. దయచేసి తగిన సూచనలివ్వండి?*

జాతకం, ఫ్యాఫోటో, ప్లాను మాకు పంపి పరిష్కారం అడగడం మంచి పద్ధతి. దోషాలు పరిహారాలు, యంత్ర ప్రతిష్ఠ గురించి మీ రిప్లై కవరులో సమాధానమిచ్చాను. సర్వరోగ నివారణి లాగా యంత్రాలలో ప్రత్యేక యంత్రమేదీ లేదు.

*దయానంద స్వామి — బెంగుళూరు*

*★ తులసి చెట్టును గురించి చెప్పండి?*

అద్భుత ఔషధాంగములు గల మొక్క తులసి. తులసి శ్వాసకోశ, చర్మ, రక్త, రుమాటిజం లాంటి అనేక వ్యాధులకు ఉపశమనాన్నిస్తుంది. ఇందుకు మొక్కలోని 'థైమాల్' రసాయనం కారణం.

*సి.పరమేశ్వరశాస్త్రి — సంగం*

*★ ప్రసిద్ధ సిద్ధాంత పంచాగాలలో సైతం తప్పులెక్కువగా వస్తున్నాయి.*

బహుశా అచ్చు తప్పులు కావచ్చు. కావాలని ఎవరూ తప్పులు చేయరు కదా. జ్యేష్ఠ తర్వాత మూల, ఆ తర్వాత పూర్వాషాఢ రావాలి. సరిదిద్దుకొంటే సరిపోతుంది.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.సుబ్బన్నగౌడ్ — ఆకులనాగారం*

*★ ఊరి చివర శక్తి ఆలయం నిర్మించవచ్చునా?*

నిత్య పూజాదికాలు నియమనిష్ఠలతో జరగాలి. రాత్రి దీపాలు వెలగాలి. శక్తి ఆవాహన మంత్రోచ్చారణతోపాటు అన్న, ఫల, కూష్మాండ, నిమ్మ బలులు తప్పక జరగాలి. లేని పక్షంలో యజమానులిద్దరికీ అరిష్టం.

*ఎం.విజయశాంతిరెడ్డి — దిగువమాఘం*

*★ వివాహ లగ్న సమయ నిర్ధారణలో పొరబాట్లు చేస్తున్నారు.*

నక్షత్ర, రాశి, లగ్న ఫలితాలు మీకు సంతృప్తికరంగా లేవంటున్నారు. మీ అరకొర పాండిత్యంతో శాస్త్రం జోలికి రాకండి. పరాభవం పాలవుతారు.

*ఫణి శకుంతల — కర్నూలు*

*★ మా అత్తగారు నన్ను చాలా బాగా చూస్తారు.*

అలా చూస్తే మంచిదే. అయితే చాలా విషయాల్నీ మీ తల్లిదండ్రులకు చెప్పకపోవడం మీ తప్పే. మీకు కుజదోషం వుందని చాలా తెలివిగా ఒప్పించిన మీ అత్తను గురించి జాగ్రత్తగా వుండండి.

*టివిఆర్ — హైదరాబాద్*

*★ జ్యోతిష శాస్త్రాన్ని అడ్డు పెట్టుకొని మా అమ్మాయిని వేధిస్తున్నారు.*

వారేం చెబుతారో నాకు చెప్పమనండి. నా ప్రశ్నలకు సమాధానం చెప్పమనండి చాలు. శాడిజం కనిపిస్తే మాత్రం మహిళా పోలీస్‌స్టేషన్‌లో వెంటనే ఫిర్యాదు చేయండి.



నెల్లూరు పెన్నానది పొర్లుకట్ట వద్ద వెలసిన చెంచు మహాలక్ష్మి వసంతోత్సవ సంబరాలు.

# కోవూరులో తాగునీటికి కటకట!

● నిధులు మంజూరు చేయాలి మరి.

కోవూరు నియోజకవర్గంలోని ప్రజలు మంచినీటి కష్టాలు ఎదుర్కొంటున్నారు. ఒకవైపు వేసవి కారణంగా త్రాగునీటి సమస్య ఎదురౌతుంటే మరోవైపు కలుషిత నీరుసరఫరా జరుగుతుండడంతో ప్రజలు సతమతమైపోతున్నారు. కలుషిత నీటి కారణంగా ప్రజలు అనారోగ్యానికి గురౌతున్నా, ఆస్పత్రుల పాలవుతున్నా పట్టించుకొనేవారే లేకుండాపోయారు. నియోజకవర్గంలోని పలు మండలాల్లో ఇలాంటి పరిస్థితి ఎదురౌతోంది. రక్షిత నీటి పథకాలు వున్నప్పటికీ వీటి బాగోగులు పట్టించుకోకపోవడం, తూతూమంత్రంగా ఏడాదికోసారి బ్లీచింగ్ చల్లి తమపనైందనిపించుకోవడం తప్ప రక్షిత మంచినీటి విషయంతో శ్రద్ధ పెట్టకపోవడంతో ప్రజలు ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తోంది. బుచ్చిరెడ్డిపాళెంలో ఈ సమస్య అధికంగా వుంది. పట్టణ పరిధిలోగల రామకృష్ణానగర్, పెద్దూరు, పెనుబల్లి, జొన్నవాడ, మినగల్లు, వవ్వేరు, కట్టుబడిపాళెం, ఇస్కపాళెం, చెల్లాయపాళెం, కాగులపాడు ప్రాంతాల్లో త్రాగునీరు కలుషితం అవుతోంది. చాలా చోట్ల మురికి కాలువల్లోనే మంచినీటి కొళాయిలు వుండడం, పైపులు వాల్వుల వద్ద మురుగునీరు చేరడం, చెత్త చెదారాలు పేరుకపోయి దుర్వాసన వెదజల్లుతుండడంతో పరిస్థితి అధ్వాన్నంగా తయారైంది. ఇప్పటికైనా సంబంధిత అధికారులు స్పందించి నీరు కలుషితం కాకుండా చూడాలని, రక్షిత నీటిని సరఫరా చేయాలని ప్రజలు కోరుకొంటున్నారు.

● చెన్నూరులో

## పారిశుధ్యం పాతర!

### అధ్వాన్నంగా గ్రామ పరిస్థితి

దగదర్తి మండలం చెన్నూరులో పారిశుధ్యం అస్తవ్యస్తంగా తయారైంది. గ్రామంలో ఎక్కడ చూసిన చెత్తకుప్పలు, మురుగునీరు, పందుల స్వైర విహారాలతో చూడగానే సుందర ముదనష్టంగా వుంది దగదర్తి పరిస్థితి. రోజుల తరబడి చెత్తను తొలగించకపోవడంతో దుర్గంధం వెదజల్లుతోంది. ఇంతగా పారిశుధ్య పరిస్థితులు క్షీణించినా పంచాయితీ అధికారులు తమకేమీ సంబంధం లేనట్లు వ్యవహరిస్తుండడంతో నానాటికి పరిస్థితి దిగజారిపోతోంది. పారిశుధ్యాన్ని మెరుగుపరచాలని, పరిశుభ్ర వాతావరణాన్ని కల్పించాలని గ్రామస్తులు పలుమార్లు అధికారులకు విన్నవించినా ఫలితం లేకపోవడంతో ఎక్కడ అంటువ్యాధులు ప్రబలుతాయోనని స్థానికులు ఆందోళన చెందుతున్నారు.

## కర్నాటకలో విజయంపై కావలిలో సంబరాలు!

### పార్వతమ్మ, విష్ణు హడావుడి సృష్టించారు.

కర్నాటక రాష్ట్రంలో కాంగ్రెస్‌పార్టీ ఘనవిజయం సాధించి, ఆ పార్టీ నేత సిద్ధరామయ్య ముఖ్యమంత్రిగా బాధ్యతులు స్వీకరించడంపై కావలి నియోజకవర్గ పరిధిలోని కాంగ్రెస్ కార్యకర్తలు హర్షం వ్యక్తం చేశారు. కావలి పట్టణంతోపాటు, రూరల్ మండలం, బోగోలు మండలంలో సంబరాలు జరుపుకొన్నారు. ఉదయగిరి నియోజకవర్గంలోనూ ఆ పార్టీ కార్యకర్తలు బాణాసంచా పేల్చి, స్వీట్లు పంచి పెట్టారు. కావలి పట్టణంలో జరిగిన ఈ ఆనందోత్సవాలలో మాజీ ఎమ్మెల్యే మాగుంట పార్వతమ్మ పాల్గొని మాట్లాడారు. కర్నాటకలో కాంగ్రెస్ గెలుపు శుభపరిణామం అన్నారు. భవిష్యత్తులో ఇలాంటి విజయాలే కాంగ్రెస్‌కు దక్కుతాయని ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. పట్టణపరిధిలో వస్త్ర వ్యాపారుల సంఘం, మాజీ ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డి అనుచరులు, మాజీ కౌన్సిలర్లు యాదగిరి, సుబ్బరాయుడు గుప్త, ప్రసన్నాంజనేయులు, కనమర్లపూడి వెంకటనారాయణ, హరి, శ్రీనివాసులరెడ్డి, కామరాజు, మల్లిఖార్జునరెడ్డి, మాల్యాద్రి నాగేశ్వరరావు, రమేష్, గ్రంధి యానాదిశెట్టి తదితరులు పాల్గొన్నారు.

● వెంకటగిరిలో

## 11 గంటల విద్యుత్ కోత!

### అల్లాడుతున్న జనం

గత కొన్నిరోజులుగా వెంకటగిరిలో విధిస్తున్న అప్రకటిత విద్యుత్ కోతలను ఎత్తివేయాలని మాజీ శాసనసభ్యుడు డాక్టర్ వి.బి.సాయికృష్ణ యాచేంద్ర డిమాండ్ చేశారు. ఏడాపెడా విధిస్తున్న విద్యుత్ కోతల వలన ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారన్నారు. మున్సిపాల్టీలో 4గంటల విద్యుత్ కోత వుంటుందని ప్రభుత్వం ప్రకటించినప్పటికీ రోజుకు 11 గంటలకుపైగా కోత పెడుతుండడంతో అల్లాడిపోతున్నారన్నారు. ఇది ఎంతవరకు సమంజసమని విద్యుత్ అధికారులను ఆయన ప్రశ్నించారు. ప్రజలు ఈ సమస్యను యాచేంద్ర దృష్టికి తీసుకొనిపోవడంతో స్పందించిన ఆయన ఫోన్‌లో ట్రాన్స్‌కో ఎస్ఇ నందకుమార్‌తో మాట్లాడి అప్రకటిత విద్యుత్ కోత ఎత్తివేయాలని కోరారు.

● కొండ బిట్రగుంటలో

## భక్తుల పాట్లు వర్ణనాతీతం!

### చేసిన వాగ్దానాలు మరచిన బీద సోదరులు

రాజకీయ నాయకులు, ప్రజాప్రతినిధులు ఇచ్చే హామీలకు అంతే వుండదు. ఆ తర్వాత వాటిని ఆచరణలోకి తేవడం మాత్రం మరచిపోతుంటారు అనేందుకు కొండ బిట్రగుంట ఆలయ అభివృద్దే ఉదాహరణ. బిలకూట క్షేత్రమైన ఇక్కడ వెలసి వుండే ప్రసన్న వెంకటేశ్వరస్వామిని దర్శించేందుకు అధిక సంఖ్యలో భక్తులు విచ్చేస్తుంటారు. ఆలయ అభివృద్ధిలో మాత్రం వెనుకబడి వుంది. ప్రసన్నుడిపై అపారమైన భక్తి, నమ్మకం కల్గిన బీద మస్తాన్‌రావు, రవిచంద్రలు దీని బాగోగులు పట్టించుకోకపోవడంతో ఇక్కడకు వచ్చే భక్తులు సమస్యలు ఎదుర్కొంటున్నారు. నీటి సమస్య భక్తులను ఇబ్బంది పెడుతోంది. స్నానపు గదులకు తలుపులు లేవు. మరుగుదొడ్లు అపరిశుభ్రంగా వున్నాయి. దప్పిక తీర్చుకొనేందుకు మంచినీరు దొరకని పరిస్థితి. మంచినీటి కోసం క్రిందకు వచ్చికొని త్రాగాల్సి వస్తుండడంతో భక్తులు పడే బాధలు వర్ణనాతీతం. ఇటీవల బ్రహ్మోత్సవాల సందర్భంగా ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు హామీల వర్షం కురిపించారు. భక్తులకు అన్ని సౌకర్యాలు కల్పిస్తామని, అందంగా తీర్చిదిద్దుతామని, త్రాగునీటికి, ఇతర అవసరాలకు ఎలాంటి ఇబ్బంది కలుగకుండా చర్యలు చేపడుతామని చెప్పడంతో భక్తులు ఇక సమస్యలు తీరుతాయని భావించారు. కానీ నేతల హామీలు నీటి మూటలన్న సంగతి ఆలస్యంగా గ్రహించిన భక్తులు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. మరి ఎమ్మెల్యే గారు ఏమంటారో?

● రూ.రెండుకోట్ల విలువైన

## ఇరిగేషన్ స్థలం కబ్జాకు యత్నం!

### *పోలేరమ్మ, ఆంజనేయస్వామి ప్రతిమలు పెట్టి మాయ చేస్తున్నారు.*

దేవతా విగ్రహ ప్రతిష్టాపన ముసుగులో కోట్ల రూపాయలు విలువ చేసే ఇరిగేషన్ స్థలాన్ని కబ్జా చేసేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. బుచ్చిరెడ్డిపాళెం మండలంలో ఇరిగేషన్ అధికారులు, సిబ్బంది ఆక్రమణదారులకు సహకారం అందిస్తున్నారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. బుచ్చి, కనిగిరి రిజర్వాయర్ నుండి అన్నారెడ్డిపాళెం పోయే కాలువ తూర్పువైపున 1.20 సెంట్లు భూమి వుంది. అన్నారెడ్డిపాళెం కాలువ మిట్ట కాలువ. వర్షాలు కురిసిన సమయంలో పొంగి పొర్లే ప్రమాదం వుంది. గతంలో ఈ కాలువ పొంగి బుచ్చిపట్టణంలో శాంతినగర్ నీట మునిగింది. అలాంటి పరిస్థితుల్లో కాలువ రిపేర్లకు ఈ స్థలం ఆవశ్యకత ఎంతో వుంది. అంతటి ప్రాధాన్యం గల స్థలాన్ని కొందరు ఆక్రమించాలని ఎత్తు వేశారు. దీనిలో భాగంగా ఈ స్థలంలో రెండు పందిళ్లు వెలిశాయి. ఒకరు పోలేరమ్మ ప్రతిమను, మరోక వ్యక్తి ఆంజనేయస్వామి ఫోటో పెట్టి పూజలు జరిపారు. ఈ పూజాది కార్యక్రమాలకు ఇరిగేషన్ డిఇ, ఎఇని పిలచి టెంకాయ కొట్టించారు. ఆక్రమణదారులు రెండు కోట్ల రూపాయల విలువ చేసే ఈ స్థలాన్ని ఆక్రమించదలచి అధికారుల అండదండలు సాధించారు. అందులో భాగంగానే ఈ టక్కుటమార విద్యలు. పలువురు ఈ ఆక్రమణలను చూడలేక పిడబ్ల్యుడి ఎస్ఇ, తహశీల్దార్‌కు సమాచారం అందించినా పట్టించుకోలేదట. జిల్లా కలెక్టర్ శ్రీధర్ అయినా జోక్యం చేసుకొని దేవుని ముసుగులో జరుగుతున్న ఆక్రమణను అరికట్టాలని కోరుతున్నారు.

విశ్వనాధరావుపేటలో

## విస్తరించిన సమస్యలు!

● ఎవరికీ పట్టదా?

బోగోలు మండలం విశ్వనాధరావుపేట పంచాయితీ బాగోగులు పట్టించుకొనే వారే లేక దుస్థితి నెలకొనింది. పంచాయితీ అభివృద్ధి, పారిశుధ్య పరిస్థితులు మెరుగుపరచడం, ప్రజలకు కనీస సౌకర్యాలు కల్పించాల్సిన అధికారులు దాని గురించే పట్టించుకోకపోవడంతో ఎవరికి పట్టని అనాథలా మారింది. పారిశుధ్యం క్షీణించి, రోడ్లు దెబ్బతినిపోయి, వీధిలైట్లు లేక చీకటి రాజ్యమేలుతోంది. గ్రామ పరిస్థితి నానాటికి క్షీణించిపోతున్నా సంబంధిత అధికారులు, ప్రత్యేక అధికారులు ఆదాయం లేదన్న సాకు చెపుతూ దీని బాగోగులు గాలికి వదిలేయడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోంది. పంచాయితీ నిధులు ఏమవుతున్నాయి, దేనికి ఖర్చు చేస్తున్నారో తెలియడం లేదని, గ్రామ సమస్యలు మాత్రం పరిష్కారానికి నోచుకోవడం లేదని స్థానికులు వాపోతున్నారు. వీధి దీపాలు లేక విషసర్పాలు సంచరిస్తుండడంతో ఎక్కడ ప్రాణాప్రాయం ఏర్పడుతోందేమోనని గ్రామస్తులు రాత్రివేళల్లో తిరగాలంటేనే హడలిపోతున్నారు. మండల అధికారులైనా కలుగజేసుకొని గ్రామాన్ని అభివృద్ధి చేయాలని కొత్తూరు వాసులు కోరుకొంటున్నారు.

# రామాచారి ఈడో పెద్ద గూఢచారి బోర్!



✍ అల్లూరు రహీం

నవ్వుకోవడానికి ప్రత్యేకంగా ఓ సమయం అంటూ ఏమీ ఉండదు. నవ్విస్తామంటే ప్రేక్షకులు ఈ రోజూ నవ్వుతారు, రేపు కూడా నవ్వుతారు. వినోదాత్మక కథలకు ప్రేక్షకాదరణ ఎప్పుడూ వుంటుంది. స్వయంవరం చిత్రంతో హీరోగా పరిచయమైన తొట్టెంపూడి వేణు సదా మీ సేవలో, కళ్యాణ రాముడు చిత్రాల్లో నటించాక కామెడీ వైపు మళ్లాడు. హనుమాన్ జంక్షన్, పెళ్లాం ఊరెళితే, యమగోల, గోపి గోపిక గోదావరి చిత్రాలు ఈ కోవలోనివే. ఈ మధ్య కెరీర్ పరంగా వెనుకబడిపోయిన ఆయనతో ఎస్పీ ఎంటర్‌టైన్‌మెంట్స్ పతాకంపై వెంకట శ్యామ్‌ప్రసాద్ రామాచారి ఈడో పెద్ద గూఢచారి చిత్రాన్ని తీశారు. మళయాళంలో విజయవంతమైన 'సిఐడి మూస' చిత్రానికి రీమేక్‌నే రామాచారి. అయితే ఈ సినిమా చిత్రీకరణలోనూ, నిర్మాణాంతర కార్యక్రమాల్లోనూ పలు సమస్యలొచ్చాయి. వాటిని అధిగమించి విడుదలైన ఈ చిత్రంలో పసలేకపోవడంతో వేణు కెరీర్ ఇంకాస్త మందగించక తప్పదనవచ్చు. ఈ సినిమా మరీ బలహీనంగా వుంది. దర్శకుడు జి.వి.ఈశ్వర్‌కు స్క్రీన్‌ప్లే సరిగ్గా వ్రాసుకోవడం కూడా చేత కాలేదు. పెద్ద కామెడీ యాక్టర్లను వాడుకోవడం తెలియలేదు. పాటలు, మాటలు అసలు బాగోలేవు. మణిశర్మ చిన్న చిత్రాలకు పేలవంగా సంగీతం సమకూరుస్తాడని ఈ సినిమాతో మరోసారి రుజువయ్యింది. పోలీస్ కమిషనర్ ఓ సామాన్య పౌరుడైన రామాచారిపై తరచూ చేయి చేసుకొంటాడు. ఇదెలా సాధ్యం? సిఎం పర్యటనలో బాంబు స్క్వాడ్ టీం సభ్యుడిగా రామాచారి వెళ్తాడు. ఇది కూడా సాధ్యంకాని విషయమే. సినిమాలో పిచ్చివాడిగా కనిపించే రఘుబాబు కూడా సిఎం పర్యటనకు ఎక్కడకు వస్తుంటే అక్కడకు వస్తుంటాడు. సిఎంకు ఉండే బందోబస్తు గూర్చి దర్శకునికి పూర్తిగా తెలియదని ఈ సినిమా చూస్తే అర్థమై పోతుంది. ఒక చోట మాటల రచయిత ప్రభుత్వం పేదలకిచ్చే కిలో బియ్యం రెండు రూపాయలంటాడు. హిందీలో కుక్కను పిలిచే పదంతో తెలుగులో కామెడీ కాదు అసహ్యమైన బూతు పుడుతుందని మాటల రచయిత తెలుసుకోకుంటే ఎలా? ఈ సినిమాలో హీరో హీరోయిన్ల మేకప్ సరిగ్గా లేదు. హీరోయిన్ కమలినీ ముఖర్జీ వికారంగా తెరపై కనపడుతుంది. బ్రహ్మానందం, అలీ, ఎల్బీ శ్రీరాం, రఘుబాబులను పక్కా కామెడీకి దర్శకుడు ఉపయోగించుకోవడంలో విఫలం కావడానికి ఈయన మక్కీ మక్కీ మళయాళ చిత్రం ఫాలో కావడమే కారణమనక తప్పదు.

చిత్ర సమీక్ష

చిత్రకథలోనికి వెళ్తే మధ్య తరగతి కుటుంబంలో పుట్టి పెరిగిన యువకుడు రామాచారి(వేణు)కు ఎస్ఐ కావాలని లక్ష్యం. అందుకోసం చాలా కష్టపడుతుంటాడు. అయితే అన్ని అర్హతలున్నా అతనికి ఉద్యోగం రాదు. ఒకసారి ముఖ్యమంత్రి హరిశ్చంద్ర ప్రసాద్(బాలయ్య) పర్యటన బందోబస్తుకు తండ్రి (చంద్రమోహన్)కు బదులు బాంబు స్క్వాడ్ సభ్యునిగా హాజరయ్యి చీవాట్లు తింటాడు. రామాచారి బావ చింతకాయల చింతామణి(బ్రహ్మానందం) ఎస్ఐగా పనిచేస్తుంటాడు. ఆయనకు రామాచారి కుటుంబానికి పడదు. ముఖ్యమంత్రి కేంద్రంలో హోమ్‌మంత్రిగా వున్నప్పుడు ఒక తీవ్రవాది(రాజ్ ప్రేమి)ని అరెస్ట్ చేయిస్తాడు. అతను సిఎంను చంపను హైదరాబాద్‌కు ముగ్గురు అనుచరులను పంపిస్తాడు. వాళ్లకు పోలీస్ కమిషనర్ చప్టా(మురళీశర్మ) కూడా సహకరిస్తుంటాడు. బాంబు స్క్వాడ్ బృందంలోని డాగ్ అర్జున్‌కు రామాచారి అంటే ఇష్టం. ఒకసారి ముఖ్యమంత్రి పర్యటనలో తీవ్రవాదులు పెట్టిన బాంబును అది నిర్వీర్యం చేస్తుంది. ఈ చర్య పోలీస్ కమిషనర్ చప్టాకు కోపం తెప్పిస్తుంది. అప్పటి నుంచి అతను రామాచారిని అణగతొక్కను ప్రయత్నిస్తాడు. దీంతో రామాచారి ప్రైవేట్ డిటెక్టివ్ ఏజెన్సీని పెట్టుకొంటాడు. ముఖ్యమంత్రిని చంపను వచ్చిన ముఠాను పట్టుకోవడంతో ప్రత్యక్షంగా రంగంలోనికి దిగే రామాచారి చివరకు విజయం సాధించడంతో చిత్రం ముగుస్తుంది. సినిమా అంటే ఒక హీరోయిన్ ఉండాలని కమలిని ముఖర్జీని పెట్టినట్లుంది. టైటిల్, కామెడీ యాక్టర్లతో ఉండే పోస్టర్ చూసి రామాచారి ఈడో పెద్ద గూఢాచారికి వెళ్తే మాత్రం తీవ్ర నిరాశ నిస్పృహలతో సినిమా థియేటర్ నుంచి బయటకు వస్తాం.

## రేంజ్ పెరిగిన అనుష్క!



హీరోయిన్ అనుష్క రేంజ్ పెరిగింది. ప్రస్తుతం ఆమెను పెద్ద హీరోయిన్ అనొచ్చు. ఎంత పెద్ద హీరోయిన్ అంటే 50కోట్ల రూపాయలని చెప్పొచ్చు. తెలుగు, తమిళభాషల్లో తెరకెక్కుతున్న భారీ చిత్రాల్లో అనుష్క నటిస్తుంది. గుణశేఖర్ దర్శకత్వంలో తయారవుతున్న రుద్రమదేవి చిత్రంలో ఆమె నటిస్తుంది. ఈ సినిమా బడ్జెట్ 50కోట్ల రూపాయలు. ఎస్ఎస్‌రాజమౌళి సినిమా బాహుబలిలో హీరోయిన్‌గా స్థానం దక్కించుకొంది. ఈ సినిమా బడ్జెట్ 80కోట్ల రూపాయలు. తమిళంలోనూ అనుష్క గాలి వీస్తుంది. అక్కడ ఇరండామ్ ఉలగమ్ (తెలుగులో వర్ణ) అనే సినిమా తెరకెక్కుతోంది. ఆర్య కథానాయకుడు. సెల్వ రాఘవన్ దర్శకత్వం వహిస్తున్నాడు. ఈ సినిమా కూడా రూ.55కోట్ల బడ్జెట్‌తో తెరకెక్కుతోంది. రుద్రమదేవి, బాహుబలి, వర్ణ ఇవన్నీ విజువల్ ఎఫెక్ట్స్‌కు పెద్దపీట వేసిన సినిమాలే.

## అమ్మ వల్లే ఈ స్థాయి...



తాను జీవితంలో ఎన్ని విజయాలు సాధించినా, ఎంత ఎత్తుకు ఎదిగినా అది మా అమ్మవల్లే సాధ్యపడిందంటోంది హీరోయిన్ తమన్నా. ఈ విషయాన్ని వివరిస్తూ అమ్మ లేకపోతే నేను ఈ స్థానంలో ఉండేదాన్నే కాదు. నా బలం బలహీనత ఇవి రెండు మా అమ్మకు తెలుసు. నాకెలాంటి పాత్రలు నప్పుతాయో చక్కగా అంచనా వేయగలదు. అందుకే అమ్మ మాటకు నేనెప్పుడూ విలువ ఇస్తా. ఇప్పటికీ అమ్మకు చెప్పందే ఏ పనీ చేయను. మా మధ్య రహస్యాలేం లేవు. నిన్ను ప్రేమిస్తున్నా అని వెంటపడిన అబ్బాయిల గూర్చి అమ్మకు తెలుసు. నాపై వచ్చే పుకార్లు తనతోపాటే చదువుతా. ఇద్దరం కలసి నవ్వుకొంటాం. నా విజయాలన్నీ మా అమ్మకే అంకితం అంటోంది మిల్క్‌బ్యూటీ.

# డాక్టర్ మాశిలామణి పదవీ విరమణ ఎక్కడ?

**• వాస్తవంగా చిత్తూరులో జరగాలి.**



జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారిగా వున్న డాక్టర్ మాశిలామణి ఈ నెలాఖరుకు పదవీ విరమణ చేయనున్నారు. చిన్నపిల్లల వైద్య నిపుణుడిగా వున్న ఈయన్ను జిల్లాస్థాయి అధికారిగా నియమించడంపై పునరాలోచన జరిపి చిత్తూరు జిల్లా బంగారుపాళెంకు బదలీ చేశారు. రాజకీయ సిఫార్సుల కారణంగా దస్త్రాలను పరిశీలన చేయకుండా జిల్లా స్థాయి అధికారిగా నియమించేశారు. స్పెషలిస్టులను జిల్లాస్థాయి అధికారిగా నియమించరాదన్న నిబంధన వుండడంతో పదోన్నతి స్థాయి తగ్గించి వేరే జిల్లాకు బదలీ చేయడం జరిగింది. ఈ ఉత్తర్వులు వెలువడే నాటికి పదవీ విరమణ చేసేందుకు ఆరు నెలల గడువు మాత్రమే వుండడంతో ఇక్కడే కొనసాగాల్సి వచ్చింది. అయితే పదవీ విరమణ మాత్రం చిత్తూరు జిల్లాలోనే చేయాల్సి వుంటుందని ఆ శాఖ అధికారులు చెబుతున్నారు. మాశిలామణి ప్రతినెల జీతం కూడా చిత్తూరు జిల్లా నుంచి డ్రా చేస్తున్నారు. ఒకటిన్నర సంవత్సర కాలం పాటు జిల్లా స్థాయి అధికారిగా విధులు నిర్వహించిన ఆయనకు ఘనంగా ఇక్కడ సన్మానం చేయాలని ఆ శాఖ ఉద్యోగులు నిర్ణయించి వున్నారు.

# అధిక మత్తిచ్చి చంపిన వైద్యుడు!

**నెల్లూరులో ఎముకల వైద్యుడి నిర్వాకం**

నగరంలో ఇందిరాభవన్ ప్రక్కన వున్న ఎముకల వైద్యుడి నిర్లక్ష్యం కారణంగా మృతి చెందిన రోగి బంధువులతో కొందరు రాజకీయ నేతలు జరిపిన చర్చలు సఫలమైనాయి. దినసరి కూలి చేసుకుని జీవనం సాగించే మహిళకు గతంలో ఎముకల వైద్యుడు శస్త్ర చికిత్స చేసి చేతులకు రాడ్డు అమర్చాడు. ఇటీవల చేతికి అమర్చిన రాడ్డును తొలగించాలని శస్త్రచికిత్స చేసిన వైద్యుడిని సంప్రదించింది. అన్ని పరీక్షలు నిర్వహించిన వైద్యుడు శస్త్ర చికిత్స చేయాలని నిర్ణయించాడు. ఇందుకు రోగి నుంచి దాదాపు 30వేల రూపాయలను ఫీజుగా తీసుకున్నట్లు సమాచారం. కానీ శస్త్ర చికిత్స చేసేందుకు మత్తు డాక్టర్‌ను బయట నుంచి రప్పించాల్సిన సదరు వైద్యుడు సొంతంగా మత్తు ఇచ్చాడట. తొలుత ఇచ్చిన డోస్ చాలకపోవడంతో మరోసారి మరికొంత మోతాదుతో మత్తు ఎక్కించడంతో ఇది వికటించి రోగి మరణించింది. రోగి మరణించిన విషయాన్ని బయటకు చెప్పకుండా కొద్దిసేపు ఆలస్యం చేశారు ఆసుపత్రి సిబ్బంది. బయట వున్న రోగి బంధువులు రోగి పరిస్థితిపై ఆరా తీయడంతో అసలు విషయం బహిర్గతం చేయక తప్పలేదు. వైద్యుడి నిర్లక్ష్యం కారణంగా రోగి మరణించిందని ఆందోళన చేయడంతో రాజకీయ నేతలు రంగ ప్రవేశం చేసి ఇరువర్గాల మధ్య రాజీ చేశారు. నెల్లూరు రూరల్ ఎమ్మెల్యేకు అత్యంత సన్నిహితుడిగా మెలిగే ఓ మాజీ కార్పొరేటర్‌కు సదరు వైద్యుడు సోదరుడు కావడంతో మరణించిన రోగి బంధువులతో చర్చలు జరిపి ఎటువంటి వివాదం లేకుండా కొంత నగదును అందించే విధంగా ఒప్పందం కుదుర్చుకున్నట్లు తెలిసింది. బయట నుంచి మత్తు డాక్టర్‌ను తీసుకొస్తే వెయ్యి రూపాయలు ఫీజు చెల్లించాల్సి వస్తుందని కక్కుర్తిపడి శస్త్రచికిత్స చేసే వైద్యుడే మత్తు మందు ఇస్తే ప్రాణాలు గాల్లో కలిసిపోక తప్పదు.



# వైఎస్ కుటుంబం ప్రజాసేవకే అంకితం!

**నెల్లూరు సిటీ వైకాపా సమన్వయకర్త అనిల్**



రాంజీనగర్ గడప గడపకు కార్యక్రమంలో అనిల్.

గడప గడపకు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీని తీసుకెళ్లాలని, అధికార కాంగ్రెస్ పార్టీ అవలంభిస్తున్న ప్రజా వ్యతిరేక చర్యలు ప్రజలకు వివరించాలని వైకాపా నెల్లూరు నగర అసెంబ్లీ నియోజకవర్గ సమన్వయకర్త డాక్టర్ పి.అనిల్‌కుమార్ చెప్పారు. ప్రజా దీవెన కార్యక్రమంలో భాగంగా 16వ తేది 15వ డివిజన్‌లోని రాంజీనగర్‌లో పర్యటించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ తొమ్మిది సంవత్సరాల చంద్రబాబునాయుడు పాలనలో అష్టకష్టాలు పడుతున్న ప్రజల సమస్యలను తెలుసుకోవాలని మండు వేసవిని సహితం లెక్క చేయకుండా అప్పుడు ప్రతిపక్ష నాయకుడుగా ఉన్న డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రజా ప్రస్థానం పాదయాత్రలో పేద ప్రజల జీవితాలను ముఖ్యంగా రైతు సోదరుల కష్టాలను తెలుసుకొని ముఖ్యమంత్రి కాగానే అనేక సంక్షేమ పథకాలను ప్రవేశపెట్టి పేదల జీవితాలలో వెలుగును నింపిన నాయకుడు వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అన్నారు. అయితే ఆ మహానేత మరణం తర్వాత ప్రస్తుత పాలకులు పేద ప్రజలకు ఉపయోగపడే ఆ సంక్షేమ పథకాలను అమలు చేయడంలో పూర్తిగా విఫలమై ప్రజలపాలిట గుదిబండలాగా ఈ ప్రభుత్వం తయారయ్యిందన్నారు. అధికారంలో వున్న కాంగ్రెస్ ప్రభుత్వం అవలంభిస్తున్న ప్రజావ్యతిరేక విధానాలను ఎండగడుతూ ప్రజలకు అండగా నిలబడిన జగన్‌ను కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు కుట్ర పన్ని జైలు పాలు చేశాయన్నారు. జగన్ లేని లోటును తీర్చను సోదరి షర్మిళ చేస్తున్న పాదయాత్రకు ప్రజల నుంచి విపరీతంగా మద్దతు లభిస్తున్నాదన్నారు. త్వరలో జగన్మోహన్‌రెడ్డి జైలు నుంచి బయటకు వస్తాడని ప్రజా సంక్షేమం కోసం పాటు పడతాడని అనిల్‌కుమార్ స్పష్టం చేశారు. ఈ కార్యక్రమంలో వైకాపా నాయకులు వేనాటి శ్రీకాంత్‌రెడ్డి, కాకుటూరు విజయభాస్కర్‌రెడ్డి, మెట్టు శశిధర్‌రెడ్డి, గూడూరు సురేందర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## స్థానిక ఎన్నికలకు సిద్ధమైన సిఎం

మొదటి పేజీ కొరవ

ముందుగా జరిపిస్తే, కాంగ్రెస్‌కు బలమైన వర్గం ఒకటి తయారౌతుందని కిరణ్ ఆశ. గ్రామాలలో వర్గాలు ఏర్పడితే, అంత సులభంగా మాసి పోవు. మండల ఎన్నికలకే కాక, అసెంబ్లీ ఎన్నికలలో కూడా వాటి ప్రభావం వుంటుంది. అందువల్లనే మొదటగా సర్పంచ్ ఎన్నికలను పార్టీ రహితంగా జరిపించబో తున్నారు. వీటిలో గెలిచిన ప్రతి ఒక్కరినీ తమ వాడే అని ప్రచారం చేసుకొంటారు. మొన్న జరిగిన సహ కార ఎన్నికలలో పాటించిన సూత్రం అదే. పార్టీ గుర్తు లేదు కాబట్టి, ఎవరు ఏ పార్టీయో లెక్క తేల్చడం జరిగే పని కాదు.

మరొకప్రక్క కళంకిత మంత్రులను వెనకేసు కొని వస్తున్నాడు ముఖ్యమంత్రి. బొగ్గు కుంభకోణం, రైల్వే పోస్టింగ్‌లలో లంచాల భాగోతంలో ఇద్దరు కేంద్ర మంత్రులు రాజీనామా చేసి ఇంటికి వెళ్ల వలసి రావడంతో, రాష్ట్రంలో కూడా సిబిఐ ఛార్జి షీట్‌లో ఆరోపణలు ఎదుర్కొంటున్న సబితా ఇంద్రా రెడ్డి, ధర్మాన ప్రసాదరావులను తొలగించాలని ఒత్తిడి అధికమైంది. సోనియాగాంధీ కూడా అదే చెప్పిం దట. అయితే ఏ కారణం వల్లనో ముఖ్యమంత్రి మాత్రం వారిద్దరినీ కొనసాగించడానికే సుముఖంగా వున్నారు.

తెలుగుదేశం అధినేత చంద్రబాబు నాయుడు ఈ ఇద్దరు మంత్రుల రాజీనామాను జాతీయ సమ స్యగా మార్చాడు. రాష్ట్రపతి వద్దకు వెళ్లి వినతిపత్రం ఇచ్చాడు. వీరిద్దరి వివాదం మొదలై ఎన్నో నెలల సమయం గడిచింది. ఇంతకాలం దానిసంగతే పట్టించుకోలేదు చంద్రబాబు. దాన్ని ఈ సమ యంలో లేవనెత్తడం వెనుక ఆయనకు, కాంగ్రెస్‌కు మధ్య నడుస్తున్న లాలూచీ వ్యవహారమే కారణమని వైఎస్.జగన్ పార్టీ గోల పెడుతున్నది. మంత్రులను ప్రభుత్వం కాపాడితే, వారు జారీ చేసిన జిఒలన్నీ సక్రమమని కోర్టులో చెప్తే తన మీద సిబిఐ పెట్టిన కేసు వీగిపోతుందని జగన్ ఆశ. మంత్రులు కిరణ్ కుమార్‌రెడ్డిని ఏదో ఒక రకంగా లొంగదీసుకొని కోర్టులో అఫిడవిట్ వేయిస్తారని చాలా ఆశగా ఎదురు చూశారు. కానీ కేంద్ర నాయకులు మాత్రం కళంకిత మంత్రుల పట్ల కఠినంగా వ్యవహరించా లని నిర్ణయం తీసుకొన్నట్లు కన్పిస్తున్నది. దానితో జగన్ కేసు పటిష్టంగా మారుతున్నది.

అయితే కిరణ్‌కుమార్‌రెడ్డికి మాత్రం మంత్రు లను ఇబ్బంది పెట్టడం ఇష్టం లేదు. వారి రాజీనా మాలకు పట్టుబడితే, జగన్ గూటిలో చేరి పోతా రన్నది ఆయన భయం. ఎన్నికలకు ముందు జిల్లాల స్థాయిలో బలీయమైన వర్గాలున్న మంత్రులు పార్టీ వదలి వెళ్తే చాలా ప్రమాదం. ఎన్నికల సమయంలో పార్టీకి అభ్యర్థులు దొరకరు, కార్యకర్తలు అసలు దొర కరు. అందువల్ల ఎట్లయినా ఈ మంత్రులను బుజ్జ గించి మచ్చిక చేసుకోవాలని చూస్తున్నాడాయన.

చంద్రశేఖర్‌రెడ్డి మరణం తీరని లోటని పెన్నా డెల్టా డిస్ట్రిబ్యూటరీ కమిటీ ఛైర్మన్ దువ్వూరు చంద్రశేఖర్ రెడ్డి సంతాపాన్ని ప్రకటించారు. ముత్తుకూరు మండ లాభివృద్ధికి, మండల ప్రజలకు ఎంతగానో ఉపయోగ పడే వారని సంతాప సందేశంలో పేర్కొన్నారు.

## మెట్టా చంద్రశేఖర్‌రెడ్డి మరణం!



తాళ్లపూడిలో భూ స్వామ్య కుటుంబీకుడైనా సామాన్యులతో సన్నిహి తంగా మసలి మంచి పేరు తెచ్చుకొన్న మెట్టా చంద్ర శేఖర్‌రెడ్డి(64) 16వ తేది చెన్నైలో మరణించారు. చంద్రశేఖర్‌రెడ్డి చేపట్టి వన్నె తేని పదవిలేదు. పాతికేళ్ల క్రితం యువజన కాంగ్రెస్ జిల్లా అధ్యక్షుడిగా మోర్ల ఆనందరావుతో పోటీపడి గెల్చిన ఆయన జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మన్‌గా, ముత్తుకూరు మండలాధ్యక్షునిగా పనిచేశారు. సెం ట్రల్ బ్యాంక్, పినాకినీ గ్రామీణ బ్యాంక్ డైరక్టర్‌గా కూడా పనిచేశారు. మెక్లిన్స్ క్లబ్ కార్యదర్శి, జిల్లా ఫుట్‌బాల్ అసోసియేషన్ అధ్యక్షునిగా రాణించారు. స్వగ్రామం తాళ్లపూడిలో స్వంత నిధులు వెచ్చించి సాయిబాబా దేవస్థానాన్ని నిర్మించి దానికి ఛైర్మన్‌గా వ్యవహరిస్తున్నారు. ఆయనకు భార్య, కుమారుడు వున్నారు. కుమారుడు విష్ణు వైకాపా నేతగా ఇప్పుడిప్పుడే గుర్తింపు పొందుతున్నాడు. కుటుంబ పెద్దను కోల్పోయిన వారికి మా సానుభూతి.

## జనవాణి

2వ పేజీ కొరవ

తాడు. ఆయన నిర్దోషి అని, అక్రమంగా జైల్లో పెట్టా రనడం కేవలం రాజకీయమే. కాని ఆయన ముమ్మా టికీ దోషినే.

*గూటూరి శ్రీహరిరావు* *గంగవరం*

### కపాడిపాళెంలో రోడ్డును ఆక్రమించారు!

నెల్లూరు కపాడిపాళెంలో మాజీ మునిసిపల్ కౌన్సిలర్ నవకోటి నరసారావు ఇంటి ఎదురుగా వున్న సిమెంటు రోడ్డును ముగ్గురు మహిళలు ఆక్ర మించుకొన్నారు. ఒకామె రోడ్డుపై రోడ్డుపై గుంతలు త్రవ్వి గుంజలు నాటి చిన్న పందిరి వేసుకొని దోసెల అంగడి నడుపుకొంటున్నది. ఒకామె తనకున్న ఆటో రిక్షాను రోడ్డుపై అడ్డంగా పెట్టి మనుషులు తిరగను ఇబ్బంది పడేలా చేస్తోంది. మరోకామె నడిరోడ్డు పైనే మంచం వేసుకొని 24 గంటలు అక్కడే బాతాకానీ చేస్తుంది. కార్పొరేషన్ అధికారులు ఈ ప్రాంతానికి విచ్చేసి దురాక్రమణలు తొలగించమనవి.

*డి.దానం* *నెల్లూరు*

### పివి ఎంత ధర్మపరుడో?

ఈ మధ్య మహారాష్ట్రలో విధి నిర్వహణ చేస్తున్న ఓ పోలీసు అధికారి ఎమ్మెల్యే కారును పట్టుకొని చట్ట ప్రకారం పెనాల్టీ విధించాడు. దీంతో ఆ అధికారిపై ఎమ్మెల్యేతోపాటు ఇంకొంత మంది ప్రజాప్రతినిధులు కలసి దాడి చేశారు. ఆ అధికారి పని పడతామన్నారు. మన దివంగత మాజీ ప్రధాని పివి.నరసింహారావు కారుకు పర్యావరణ సర్టిఫికేట్ లేదని పోలీసు కమిష నర్ పట్టుకొంటే ప్రధానమంత్రి అయిన నరసింహా రావు గారు డ్రైవర్ చేత 1200 రూపాయలు పంపి ఫైన్ చెల్లించి, ప్రభుత్వ చట్టాన్ని, ఆ పోలీసు అధికా రిని గౌరవించాడు. మహారాష్ట్ర ఘటనను పేపర్లలో చదివాక చట్టాన్ని గౌరవించిన ప్రధానిగా పివి గారు జ్ఞాపకం వచ్చి వారికి అంజలి ఘటిస్తున్నాను.

*తూపిలి వనమాలి* *హైదరాబాద్*

## నెల్లూరు కుసుమాలు

9వ పేజీ కొరవ

డెంట్ చాట్ల నరసింహారావు చెప్పారు. పరీక్షలకు 89 మంది విద్యార్థినీ, విద్యార్థులు హాజరుకాగా అం దరూ ఉత్తీర్ణులయ్యారన్నారు.

### హిమాలయ ప్రతిభ

నెల్లూరు మూలాపేటలోని హిమాలయ హైస్కూల్ విద్యార్థులు పదవతరగతి పరీక్షా ఫలి తాల్లో మంచి జిపిఏ సాధించారు. ఇక్కడ చదివిన బి.సౌమ్య 9.8, జిఎల్ శరత్‌చంద్ర 9.7, షేక్. రిజ్వానా 9.7, ఎన్.గోకులకృష్ణ 9.5, షేక్. అఖిల్ 9.5 పాయింట్లు సాధించారని హైస్కూల్ డైరక్టర్ హిమశైలజ తెలిపారు. ఏటా సాధిస్తున్న ఫలితాలే తమ బోధనకు సాక్ష్యమన్నారు.

### సింహపురి స్కూల్ విజయ దుందుభి!

పదవతరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు పొదలకూరు రోడ్డులోని సింహపురి హైస్కూల్ విద్యార్థులు విజయ దుందుభి మ్రోగించారు. ఇక్కడ చదివిన ఎన్.లావణ్య 9.7, యు.జ్యోతిరూప 9.3, ఎన్.ఉషారాణి 9.2 పాయింట్లు సాధించారు. గత 32 ఏళ్లుగా విలువలతో కూడిన విద్యనందించడం వల్ల మంచి ఫలితాలు సాధించామని హైస్కూల్ కరస్పాండెంట్ వై.మోహన్‌రాజు చెప్పారు.

### మంచిమార్కుల న్యూ నేతాజి టాలెంట్ స్కూల్!

నెల్లూరు జేమ్స్‌గార్డన్‌లోని న్యూ నేతాజి (జడ్ఎస్ఆర్) టాలెంట్‌స్కూల్ విద్యార్థులు పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో మంచిమార్కులు సాధిం చారు. మ్యాథ్స్‌లో 10మంది విద్యార్థులు పదికి పదిపాయింట్లు, సైన్స్‌లో ఐదు మందికి 10కి 10 పాయింట్లు, సోషల్‌లో ఇద్దరు విద్యార్థులు పదికి పది పాయింట్లు, ఇంగ్లీషు, హిందీలో చెరొకరు చొప్పున పదిపాయింట్లు సాధించారని స్కూల్ కర స్పాండెంట్ జడ్.శ్రీనివాసులరెడ్డి చెప్పారు.

### శిల్పాస్కూల్ రికార్డు!

పదవతరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు రెవెన్యూకాలనీలోని శిల్పా స్కూల్ విద్యార్థులు పి.అం జలి 9.8 పాయింట్లు, వై.శ్రావ్య 9.7 పాయింట్లు, షేక్. సబ్రీమ్ 9.7 పాయింట్లు, సాయి కార్తికేయ, జి.లక్ష్మీప్రియ, లక్ష్మీప్రసన్నలు 9.7 పాయింట్లు సాధిం చారు. మ్యాథ్స్‌లో 28మంది, సైన్స్‌లో 16మంది, సోషల్‌లో 23మంది, తెలుగులో 23, హిందీలో 7, ఇంగ్లీషులో పదిమంది పదికి పది పాయింట్లు సాధిం చారని కరస్పాండెంట్ మల్లిఖార్జునరెడ్డి తెలిపారు.

### కస్తూరిదేవి విద్యార్థుల ప్రతిభ

పదవ తరగతి పరీక్షల్లో తమ స్కూల్‌లో చది విన విద్యార్థులు అత్యుత్తమ ప్రతిభ కనబరచారని కస్తూరిదేవి విద్యాలయం ప్రధానోపాధ్యాయురాలు టి.వనజ తెలిపారు. 70 మంది పరీక్షలకు హాజరు కాగా 51మంది అత్యుత్తమ జీపీఏతో ఉత్తీర్ణత సాధిం చారని వివరించారు. డి.రాజేశ్వరి 8.8, ఎస్.దీపిక 8.5 పాయింట్లు, వి.ప్రవీణ 8.2 పాయింట్లు, కె.శ్రావణి 9 పాయింట్లు సాధించారని చెప్పారు. కూలీ పనులు చేసుకొనే వారి కుటుంబాలకు చెం దిన రాజేశ్వరి, దీపిక ప్రథమ, ద్వితీయ స్థానాల్లో నిలవడం తమకు గర్వకారణంగా వుందన్నారు. నిరు పేదలైన విద్యార్థులను అత్యుత్తమమైన భావనతో ప్రతి భావంతులుగా తీర్చిదిద్దామన్నారు. మొత్తం మీద 10 మందికిపైగా 7 పాయింట్లు, 20 మందికిపైగా 6 పాయింట్లు, 40 మందికిపైగా 5 పాయింట్లు సాధిం చారని తెలిపారు. ఉపాధ్యాయుల కొరతను తీర్చేం దుకు పాఠశాల కరస్పాండెంట్ జెవి.రెడ్డి 7మందిని నియమించి పేద బాలికల విద్యాభివృద్ధికి కృషి చేస్తు న్నారన్నారు. చరిత్ర కలిగిన కస్తూరిదేవి విద్యాల యం ఉన్నతికి ప్రభుత్వం, దాతలు తోడ్పాటునందిస్తే పేద, బడుగు, బలహీన విద్యార్థులు చదువుకొనే కస్తూరిదేవి విద్యాలయం జిల్లాలోనే అత్యున్నత స్థాయికి వెళ్లే అవకాశం వుందన్నారు.

### సెయింట్ జోసఫ్ స్కూల్ ఘనత!

పదవతరగతి పరీక్షా ఫలితాల్లో సాధారణ విద్యార్థులతో అసాధారణ విజయాలను నెల్లూరు పొదలకూరు రోడ్డులోని సెయింట్ జోసఫ్ స్కూల్ సాధించింది. ఇక్కడ చదివిన ఎం.డి.యూనస్, 9.8 పాయింట్లు, మరో ముగ్గురు విద్యార్థినులు 9.7 పాయింట్ల చొప్పున సాధించారు. మొత్తం 80 మంది విద్యార్థులు పరీక్షలకు హాజరుకాగా 99శాతం ఫలి తాలు సాధించినట్లు హెడ్‌మిస్ట్రెస్ చెప్పారు.

### విజయకృష్ణ విజయాల బాట!

నెల్లూరు మూలాపేటలోని విజయకృష్ణ హైస్కూల్ విద్యార్థులు పదవతరగతి పరీక్షాఫలితాల్లో మంచిమార్కులు సాధించారు. విద్యార్థులు జి.రవి తేజ 9.7పాయింట్లు, సునీత 9.7 పాయింట్లు సాధిం చారని స్కూల్ కరస్పాండెంట్ జి.విజయనిర్మల తెలి పారు. ఫలితాల్లో తమ విద్యార్థులు నూటికి నూరు శాతం ఉత్తీర్ణత సాధించారని వివరించారు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

నించారు. కవులు పెరుగు రామకృష్ణ కమర్షియల్ ట్యాక్స్ శాఖలో అధికారి. సరోజాదేవి నారాయణ ఇంజనీరింగ్ కళాశాల ఆంగ్ల శాఖాధిపతి.

### జొన్నవాడ కామాక్షమ్మ బ్రహ్మోత్సవాలు!

బుచ్చిరెడ్డిపాళెం మండలం జొన్నవాడ గ్రామంలో వెలసిన మల్లిఖార్జునస్వామి సమేత కామాక్షితాయి అమ్మవారి బ్రహ్మోత్సవాలు ఈ నెల 30వ తేదీన ప్రారంభమవుతాయి. 30వ తేది అంకురార్పణ, 31వ తేది తిరుచ్చి ఉత్సవం, 1వ తేది శేషవాహనం, 2వ తేది పురుషామృగ వాహనం, 3వ తేది సింహ వాహనం, 4వ తేది హంస వాహ నంపై కామాక్షమ్మ భక్తులకు దర్శనమిస్తారు. 5వ తేది రావణసేవ, 6వ తేది వెండి నందిసేవ, 7వ తేది రథోత్సవం, 8వ తేది కళ్యాణోత్సవం, రాత్రికి తెప్పోత్సవం జరుగుతాయి. ప్రతిరోజు రాత్రివేళల్లో సాంస్కృతిక కార్యక్రమాల్లో భాగంగా నాటకాలు, నాట్య ప్రదర్శన, భక్తి పాట కచ్చేరీలుంటాయి. కళ్యా ణోత్సవానికి పుల్లా భట్ల వెంకటేశ్వర్లు వాఖ్యాతగా వ్యవహరిస్తారు. కామాక్షమ్మ భక్తులను ఈ ఉత్సవా లకు తరలి రమ్మంటున్నాడు ఆలయ కార్యనిర్వహణాధి కారి వేగూరు రవీంద్రరెడ్డి.

### మెట్టా మరణం పట్ల దువ్వూరు సంతాపం!

ముత్తుకూరు మాజీ మండలాధ్యక్షుడు మెట్టా

## పదరంగం -68

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | ■ | 2 | | | ■ | 3 | | 4 |
| 5 | | 6 | | ■ | ■ | 7 | | ■ | |
| | ■ | | ■ | 8 | 9 | ■ | 10 | 11 | |
| 12 | 13 | | ■ | 14 | | | ■ | | ■ |
| 15 | | ■ | 16 | | | ■ | 17 | | |
| | ■ | ■ | 18 | | ■ | 19 | | ■ | ■ |
| 20 | | 21 | ■ | ■ | 22 | | | ■ | 23 |
| ■ | ■ | | ■ | 24 | | | ■ | 25 | |
| 26 | 27 | | ■ | ■ | 28 | | 29 | | |
| 30 | | | ■ | 31 | ■ | ■ | 32 | | ■ |

**అడ్డం**

2. బంధము, తాడు (3)
3. బొమ్మ, విగ్రహం (3)
5. పతనానికి వ్యతిరేకం (4)
7. సమావేశం (2)
8. సురులు త్రాగేది (2)
10. స్త్రీ, ఒక మాసపత్రిక పేరు (3)
12. దక్షిణ దిక్పాలకుడు (3)
14. పాలింపబడేవాడు (3)
15. నక్షత్రం, సినీ నటి (2)
16. ఈమె వాని భార్య 3,5,4 అక్షరాలు (3)
17. ఋతువులలో మొదటిది (3)
18. అటునుంచే తంటా (2)
19. వారములలో మొదటిది (2)
20. జాకెట్టు, రవిక (3)
22. రెండు 'ల' లతో స్త్రీ (3)
24. విశ్రాంతి (3)
25. పోబిడి, సమాచారం (2)
26. కంట్లో నలుసు (3)
28. యుద్ధ రంగం (5)
30. గతించిన కాలం (3)
31. ఇంగ్లీషులో రా (1)
32. మేలు . ప్రతి సినిమా చివర్లో వేసే టైటిల్ కార్డు (2)

**నిలువు**

1. అడ్రసు, తెలుగులోకి మారిన హిందీ అడ్రసు (2)
2. సర్పము (2)
3. తెలుగు సంవత్సరాలలో మొదటిది (3)
4. మమకారం (3)
5. ఇరువురికి మేలు కలిగించేది (6)
6. వానరంలోంచి వచ్చినవాడు (3)
8. వేకువ, ప్రభాతవేళలో దేవునికి పాడేది (4)
9. చీకటి, తిమిరం (3)
11. నివసించే చోటు (3)
13. మౌర్యుని తల్లి (2)
16. భాగం, వంతు ఇంట్లో పోర్షను (2)
17. అన్న భార్య (3)
19. ఆవుల మంద (4)
21. ముల్లు (4)
22. క్రింద నుంచి కరాల (3)
23. పుప్పొడి (3)
25. మొదలు (3)
26. ఆభరణం (2)
27. సన్నని కొమ్మ (2)
29. క్రింద నుంచి తోక తెగిన శునకం (2)

**సమాధానాలు**

## పదరంగం -67

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1గు | ణ | 2పా | రం | ■ | 3నా | 4వి | 5కు | డు | ■ |
| లా | ■ | రం | ■ | 6అ | వ | న | తం | ■ | 7తా |
| బి | ■ | 8గ | 9మ | నం | ■ | 10యం | త్రం | ■ | కి |
| ■ | 11చ | తు | ర | త | ■ | ■ | ■ | 12ఆ | ట |
| 13పో | ర | డు | ■ | ■ | 14వి | జ్ఞా | ప | న | ■ |
| 15ని | ఖా | ■ | 16మే | లు | ■ | ■ | ■ | 17వా | ణి |
| ■ | ■ | 18ఈ | క | ■ | 19కొ | 20ను | 21గో | లు | ■ |
| 22వి | 23న | తి | ■ | 24ము | ■ | 25లి | చ | ■ | 26క |
| 27ము | క్క | ■ | 28తే | జ | ము | ■ | 29రం | 30వు | పా |
| ఖం | ■ | 31ఆ | మ | ని | ■ | 32లా | ■ | 33పా | లం |

# సమాజ జీవిత అనుభవాల రంగరింపు 'సినారె' కవిత్వం!

"సరస కవీశ, నీ యశము సర్వదిగంచల చంచలేక్షణా వరకుచ, చందనాంశమై పండిత చిత్త చకోర చంద్రికోత్కరమయి, కాల పత్రమున గట్టిగ వ్రాసిన వర్ణపంక్తియై ధర వెలుగొందుతన్, జన వితానము సన్నుతింప నిత్యమున్".

కవి కోకిల దువ్వూరి రామిరెడ్డి ఒక చోట 'కవి'ని గురించి వ్రాసిన శుభ లక్షణాలన్నీ డాక్టర్ సినారెకు నప్పుతాయి.

రైతు కుటుంబంలో పుట్టి సాధక బాధకాలను అనుభవించి, విద్యాధికుడై 'కలం'పట్టి కవితా క్షేత్రాన్ని సునాయాసంగా దున్ని పారేసిన ఆ సమున్నత మూర్తిని గురించి ఎంత చెప్పినా తక్కువే.

అద్భుత కావ్యాలు రాసి, సమాజాన్ని, జీవితానుభవాలను సమ్మిళితం చేసి వాటి గుణగణాలను చెప్పే రీతి అద్భుతమనిపిస్తుంది. జూలై 29 ఆయన పుట్టిన రోజు. గత కొన్నేళ్లుగా తన పుట్టిన రోజున కవితా సంపుటిని వెలువరించడం ఆనవాయితీగా పెట్టుకున్నారు. ఆ సందర్భంగా ఎనభై రెండేళ్ల వయసులో వెలువరించిన కవితా సంపుటి "వాక్కుకు వయసులేదు".

సమాజంలో కవులున్నారు. సాహిత్య కృషీవలులున్నారు. ప్రతిభ, కృషి, పాఠక జన సమ్మతి వున్నప్పుడు 'కీర్తి' ప్రవాహమై పోతుంది. సమాజ కవుల్లో మరో వర్గం వుంది. పై లక్షణాలుండవు. కీర్తి మాత్రం కావాలి. దీనికోసం అనేక అడ్డదారులు త్రొక్కుతారు. దీన్నే కీర్తి కండూతి అంటారు. విజ్ఞులు సినారె అంటారు కదా.

"వన్నె కెక్కాలని ఉపశమనం లేని తపన ఈ కండూతిది ప్రతిభ ద్వారా సంప్రాప్తించిన సత్కీర్తి ప్రశంసనీయం, మరి కండూతి రూపంలో వుంటే విసర్జనీయం. (కండూతి త్రయం). ప్రశ్నించినపుడు సమాధానం ఏదో రూపంలో రావాలి. అలా అన్నప్పుడే స్థిరత్వం లేదంటారాయన.

"ప్రశ్నలు ఎదురైనప్పుడు సమాధానాలను సుముఖంగానో, విముఖంగానో తేల్చి చెప్పాలి. ఏ వైపు మొగ్గాలో అంతుపట్టక కళ్లు మూసుకుని అంతర్ముఖంగా ఉండిపోవడమంటే ఆ ప్రవృత్తి ఆలోచనల అస్థిరత్వానికి నిదర్శనం". (విజయోన్ముఖం)

డాక్టర్ సినారె ప్రతి కవితలోనూ సమస్య గురించి చెబుతారు. దాన్ని సమాజపరంగా విశ్లేషిస్తారు. చివర తనేం చెప్పాలో దాన్ని అరమరికలు లేకుండా చెబుతారు. ఇదీ ఆయన తత్వం, మనస్తత్వం!

కోరికలు నియబద్ధంగా ఉండాలి. అలా లేకపోతే విపరీత పరిణామాలు ఎదురవుతాయి. "కోరికలు నియబద్ధంగా వున్నప్పుడే అవి ప్రవృత్తికైనా, మనిషికైనా అస్తిత్వ వికాసానికి దోహదం చేస్తాయి. అలాకానప్పుడు విపరీత పరిణామాలకు దారి తీస్తాయి(మతి వైపరీత్యం).

> **పుస్తకసమీక్ష**
>
> **వాక్కుకు వయసు లేదు**
> (కవితా సంపుటి)
>
> కవి : **డాక్టర్ సి.నారాయణరెడ్డి**
> విశ్లేషకులు : **పాయసం సుబ్రహ్మణ్య మహర్షి**
> వెల : **150/-** పేజీలు : **176**
>
> **ప్రతులకు**
> వరేణ్య క్రియేషన్స్, హైదరాబాద్.

సమాజాన్ని, కాలాన్ని అర్థం చేసుకొని మనిషి సాగిపోయినప్పుడే ప్రయాణం సక్రమంగా సాగుతుంది. "సమకాలీన పరిస్థితులను స్వాధీనం చేసుకొని సాగిపోయే ప్రతి జీవి గతి తిరుగు లేని పురోగతి" (తిరుగులేని పురోగతి).

డాక్టర్ సినారె కవిత తెలుగు సుశోభిత, సాంస్కృతిక పరిమళ భరిత, వర్తమాన సూచిత, పురోగమన చరిత మరికొన్ని కవితలు ఆస్వాదించండి మరి.

*"స్వరమున్నపుడు అపస్వరం తప్పదు*
*శబ్దమున్నప్పుడు అపశబ్దం తప్పదు*
*రొదలను తుద ముట్టించేది*
*మౌనాయుధమే"* (మౌనాయుధం)

*"అమ్మ నన్ను తొట్టిలో పడుకోబెట్టి*
*జోలపాట పాడుతూ వుంటే*
*నా కళ్లపై వాలుతున్న నిద్రను ఊదేసి*
*ఆ పాటలోని లయకు అనుగుణంగా*
*కాళ్లూ, చేతులూ కదిలించిన*
*నా పసితనం"* (ఎదుట నిలచిన నా పసి తనం)

*"నా ముని మనుమలూ, ముని మనుమరాళ్లు*
*కిలకిలా నవ్వుతూ కేరింతలు కొడుతుంటే*
*నేను మా ఊరిలో ఉన్నప్పటి*
*నా పసితనం వాటితో*
*శ్రుతి కలుపుతుంది"* (ఎక్కడున్నా)

*"అచంచల సంకల్పము వుంటే*
*పర్యవసానం ఎప్పుడూ*
*వెనుతిరగని పురోగమనమే"* (తిరుగు లేనిది)

*"ఏ పిల్లల్లోనైనా రెండు పార్శ్వాలూ*
*సమస్థాయిలో వున్నప్పుడే*
*బాల్యమే భవిష్యత్తుకు*
*బలమైన పునాదిగా నిలుస్తుంది"* (లేత కిరణాల మధ్య)

ఇలా ఆయన కవిత్వంలో సలహాలు, అభిప్రాయాలు, అనుభవాలు, కరుణార్ద్ర భావాలూ కోకొల్లలు. పరిశీలిస్తూ, ఆస్వాదిస్తూపోతూ పచ్చని బృందావనంలో, వెన్నెల్లో, అందమైన పక్షి విహారంలాగే వుంటుంది పాఠకుల మనఃస్థితి. అయితే సునిశిత ప్రజ్ఞాపాటవ, పండితమన్యుడిలో లోపాలు లేవా అంటే అందరిలోనూ ఏవో లోపాలుంటాయి. ఎవరూ పరిపూర్ణులు కాదు కదా? నామటుకు నేను నిత్య విద్యార్థిని అన్నారు ఓ సభలో వారు. ఎంతటి వినయం, మరెంతటి సంస్కారం?

ఎనభై రెండేళ్ల వయసులో ఎనభై రెండు కవితలతో "వాక్కుకు వయసులేదు"ను వెలువరించడం ఇక్కడ ప్రత్యేకత. అలతి యలతి పదాలతో కవితలు సృజియిస్తూ పండిత పామరులను సైతం ఆకట్టుకోవడం ఆయన కవిత్వం నైజం. అందుకే వారికి సహృదయ నమస్కారం.



రైతు లోకం

# వేరుశనగలో సమగ్ర పోషక పదార్థాల యాజమాన్యం!

వేరుశనగ సాగుకు నీరు త్వరగా ఇంకే తేలిక నేలలు అనువైనవి. తగినంత సేంద్రీయ పదార్థాలు, కాల్షియం, గంధకము ఉండే భూములు శ్రేష్టమైనవి. ఉదజని సూచిక (ph) 5.3 నుండి 6.6 వరకు వున్న నేలలు మంచివి.

తొలకరి వర్షాలతో దుక్కి చేసేటప్పుడు ఎకరాకు 2 నుండి 4 టన్నుల పశువుల ఎరువు లేదా కంపోస్టును వేసి కలియదున్నాలి. స్థూల పోషకాలను అందించే రసాయనిక ఎరువుల మోతాదు : నత్రజని – 8కిలోలు(18 కిలోల యూరియా); భాస్వరము – 16 కిలోలు(100 కిలోల సింగిల్ సూపర్ ఫాస్ఫేట్); పొటాష్ – 20కిలోలు (35కిలోల మ్యూరేట్ ఆఫ్ పొటాష్).

వేరుశనగ చిక్కుడు జాతికి చెందిన పంట. వేరు బుడిపెలలో వుండే రైజోబియం బాక్టీరియా వాతావరణంలోని నత్రజనిని స్థిరీకరించి మొక్కకు అందజేస్తుంది. విత్తిన 25 రోజులవరకు ఈ స్థిరీకరణ జరగదు. కాబట్టి విత్తేటప్పుడు సిఫారసు చేసిన నత్రజని ఎరువును వేయాలి.

**డాక్టర్ కె.పుల్లంరాజు**
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

భాస్వరంను సింగిల్ సూపర్ ఫాస్ఫేట్ రూపంలో అందజేయడం వేరుశనగ పంటకు మంచిది. సింగిల్ సూపర్ ఫాస్ఫేట్‌లో ఈ పంటకు అవసరమైన కాల్షియం(20 శాతం), గంధకము(12.5 శాతం), జింకు, బోరాన్, రాగి, మాంగనీసు, మూలకాలు కూడా స్వల్ప పరిమాణంలో వున్నాయి. భాస్వరం, పొటాషియం ఎరువులను ఆఖరి దుక్కిలో 5 సెంటీమీటర్ల లోతు పొరలలో పడేటట్లు ఎరువును గొర్రును ఉపయోగించి వేస్తే మంచిది.

సేంద్రీయ ఎరువుల వాడకం తగ్గటం వల్ల సూక్ష్మధాతు లోపాలు కనిపిస్తున్నాయి. జింకు లోపముంటే లేత ఆకులు ఇత్తడి రంగుకు తిరుగుతాయి. మొక్కలు పెరగవు. పైరులో జింకు లోపం గమనించినప్పుడు 0.2 శాతం(2 గ్రాములు జింక్ సల్ఫేట్/లీటరు నీటికి) ద్రావణాన్ని వారం రోజుల వ్యవధిలో 2 సార్లు పిచికారీ చేయాలి.



# ఉత్తరక్రియలు

మూర్తీభవించిన మానవత్వం, పరిమళించిన ప్రేమామృత హృదయంతో
మా జీవితాలలో వెలుగులు నింపిన తేజోమూర్తి, మా మనో మందిరాలలో దివ్యదీప్తి

## శ్రీ మెట్టా చంద్రశేఖర్‌రెడ్డి గారు

తేది 16-05-2013 గురువారం పరమపదించారు. వారి పవిత్రాత్మకు శాంతి కలగాలని
భగవంతుని ప్రార్థిస్తూ... శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

భార్య : మెట్టా రమణమ్మ

కుమారుడు - కోడలు
మెట్టా విష్ణువర్ధన్‌రెడ్డి - వింధ్య

మనుమరాళ్లు
సాయి శ్రేయ, సాయి హాస్య

అన్నలు - వదినలు
-- - మెట్టా కామాక్షమ్మ
మెట్టా చెంచురెడ్డి - పద్మావతమ్మ
-- - మెట్టా రాధా శ్యామల

కుమారులు కోడళ్లు
ప్రణయ్
సునీల్ కుమార్‌రెడ్డి - కీర్తన
డా॥ వినోద్‌రెడ్డి - డా॥ సుజాన్ (SUZANNE)
వినయ్

కుమార్తెలు - అల్లుళ్లు
ఈపూరు పవిత్ర - --
పల్లా షర్మిల - విద్యాసాగర్‌రెడ్డి

తమ్ముళ్లు - మరదళ్లు
మెట్టా సనత్‌కుమార్‌రెడ్డి - కృష్ణవేణి
-- - మెట్టా సుజనమ్మ

రాజగోపాలరెడ్డి - స్నిగ్ధ
అభినవ్

కర్రి ప్రవీణ - సత్యనారాయణరెడ్డి
చిగుళ్లపల్లి శ్రావ్య - రాజ

బావ మరదులు - చెల్లెళ్లు
-- - మాగుంట సాయిలక్ష్మీ
మాగుంట శివకోటారెడ్డి - కామక్షమ్మ
మాగుంట ద్వారకనాథరెడ్డి - వనమ్మ
-- - మాగుంట సువర్ణమ్మ

అల్లుళ్లు, కోడళ్లు
డా॥ కోనిరెడ్డిగారి నిత్య (USA), అడపా పార్వతి
దువ్వూరు సంధ్య, మాగుంట అభిషేక్‌రెడ్డి
బల్లివాడ నిరూపమ, మాగుంట రాహుల్‌సేన్
డా॥ పేర్నాటి నవ్య

అత్త :
తిక్కవరపు రాజేశ్వరమ్మ

అల్లుడు, కోడళ్లు :
పుచ్చలపల్లి కవిత , తాటిపర్తి దేవసేన.
తిక్కవరపు విజయకుమార్‌రెడ్డి

వియ్యపురాలు : వేమారెడ్డి వాసంతమ్మ

అల్లుడు : వినోద్‌రెడ్డి (Australia)

## శ్రీ మెట్టా చంద్రశేఖర్‌రెడ్డి గారు

మాజీ మండలాధ్యక్షులు, ముత్తుకూరు.

జననం : 15-05-1949 మరణం : 16-05-2013

మనుమలు - మనుమరాళ్లు : జయ్‌విశ్వక్‌సేన్‌రెడ్డి, స్వనిక్‌రెడ్డి, వెంకట్‌ప్రజ్వల్, హెచ్.కె.లక్ష్మి, లక్ష్మీ సమైక్య, కీర్తిక, శృతిక

**ఉత్తరక్రియలు : తేది 29-05-2013 బుధవారం "నిలుపు" తేది 30-05-2013 గురువారం "ఎత్తురేవు"**
నెల్లూరు, మాగుంట లేఅవుట్‌లోని మా స్వగృహము నందు జరుగును. బంధుమిత్రులకు తెలియజేయడమైనది.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com